రామానుజరావు, సోమరాజు

దానవీరకర్ణ

రాజమండ్రి, 1925

Record no. 431

Rāmānujarāvu, Sōmarāju

Dānavīrakarṇa

Rājamaṇḍri, 1925

Record no. 431

# SUNDARAYYA VIGNANA KENDRAM

1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

రామానుజరావు, సోమరాజు.

దానవీరకర్ణ : 7 అంకముల నాటకము / సోమరాజు రామానుజరావుగారిచే రచియింపఁబడినది.- 1. కూర్పు.- రాజమండ్రి : బ్రహ్మజోస్యుల వేంకటసుబ్బారావు, 1925.

122 p. ;22 cm.

Record no. 431

Rāmānujarāvu, Sōmarāju.

Dānavīrakarṇa : 7 aṃkamula nāṭakamu / Sōmarāju Rāmānujarāvugāricē raciyimpam̐baḍinadi.- 1. kūrpu.- Rājamaṇḍri : Brahmajōsyula Vēṅkaṭasubbārāvu, 1925.

122 p. ;22 cm.

Record no. 431

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB Date filming began:

ప్రవేశ సంఖ్య... 5.0.0.

శ్రీ

సారస్వత నికేతనము, వేటపా

ఇండ్లకు గ్రంథముల గొనిపోవుట కొరకైన దరఖా

పాఠకుని ~~పాఠకురాలి~~ పేరు. Rangavarapu . Krishnamur

తండ్రి లేక భర్త పేరు. pedu Venkateswarlu

వయస్సు 2 2 కులము. Brahmin వృత్తి. Kan

# దానవీరకర్ణ.





(7 అంకముల నాటకము.)

ఇది, స్వరాజ్యరథాది బహుగ్రంథకర్తయు

భద్రాచల పురవాసియు నగు

శ్రీయుత-సోమరాజు రామానుజరావు

గారిచే రచింపఁబడినది.

ప్రకాశకులు

బ్రహ్మజోస్యుల వేంకటసుబ్బారావు

సోమరాజు రామానుజరావు

శ్రీకృష్ణా బుక్ డిపో,

రాజమండ్రి.



మొదటికూర్పు 1000 ప్రతులు.

చిత్రపు నాగరాజు పంతులుగారి

రాజన్ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

రాజమండ్రి.

1925.

 [వెల 1—[illegible]—0

# మకుటము.

—:♦:—

కృష్ణుఁడు—

"నరవర! నీచే నాచే
వర మడిగిన కుంతిచేత వాసవుచేతన్
ధర చేత శల్యుచేతను
నరయఁగ కర్ణుండు నీల్గె నార్వురిచేతన్."

చాటువు. పుట **114.**

# పీఠిక.

రంగూనుపురమునందలి, "మాంసా"గారి, "ఎంపైర్ పార్సీ థియేటరువారిచే నీనాటకము, గుజరాతీభాషలో ప్రదర్శింపఁబడఁగా నిందలికథాసంవిధానమున కాశ్చర్యపడి, నేను దీని నాంధ్రమున రచియింపవలెనని యుత్సాహపడి, తదనంతర మొక వత్సరమునకు దీనిని పూర్తి చేయఁగలిగితిని. గుజరాతీభాష నాకంతగా తెలియకున్నను, భావముగ్రహించికొంతయూహించికొంతవ్రాయుటచేత "మాంసా" గారినాటకపు రసమిందు విశేషముగ లోపించియుండును. ఈనాటకమును రచించునెడ నాకింతకన్న శక్తి చాలదయ్యె. భీముఁడు దుశ్శాసనుని చంపునెడ భీతియు కర్ణునిదానములఁ గాంచునెడ శరీరమున పులకాంకురములును, గలిగి మహానందమునకు లోనగుచుంటిని. నేనీ నాటకమును ప్రదర్శించినపుడెల్ల తప్పక వీక్షించుచుండువాఁడను. కర్ణమరణకాలమున, కుంతి సంభాషించి దుఃఖముతోఁ జనునప్పుడు, కర్ణుఁడావంకకే చూచుచు—"ఔరా! మాతృప్రేమయందలితీపి!" అనిపలికినప్పుడొడలుగగుర్పొడువని రసజ్ఞులుండరు. "నాటకములమార్కెట్టు" చౌకయైన యీసుభిక్షపుదినములలో నా "దానవీరకర్ణ" నాటకమును కన్నెత్తి యెవ్వరైనఁ జూచి రసగ్రహణము చేసినచో. నావ్రాతకు ఫలముగలిగెనని యానందింతును, ముఖ్యముగ నటకులు, దీనిని గమనించి రంగస్థలమున కెక్కింతురని ప్రార్థించుచున్నాను. ఇందుగల ముద్రణాప్రమాదములను సందర్భమునను సరించి దిద్దుకొందురుగాక! ముఖ్యముగ ద్వితీయాంకము ౧వ దృశ్యమున 12వ పంక్తిలో లలితవచనమున "సూర్యపుత్రుఁడును" అనుటకుమారు "సూతపుత్రుఁడును" అని చదువుకొనవలెను.

గ్రంథకర్త.

## ఇందలి పాత్రములు.

### పురుషులు.

1. కర్ణుఁడు.
2. కృష్ణుఁడు.
3. ధర్మరాజు.
4. భీముఁడు.
5. అర్జునుఁడు.
6. నకులుఁడు.
7. సహదేవుఁడు.
8. దుర్యోధనుఁడు.
9. ధృతరాష్ట్రుఁడు.
10. విదురుఁడు.
11. భీష్ముఁడు.
12. ద్రోణుఁడు.
13. కృపుఁడు.
14. అశ్వత్థామ.
15. ఇంద్రుఁడు
16. సూర్యుఁడు.
17. పరశురాముఁడు.
18. కర్ణమంత్రి.
19. శల్యుఁడు.
20. పోగులుకొండఁడు.
21. సంజయుఁడు.

సందర్భానుసారముగ సారథిమొదలగువారు వత్తురు,

### స్త్రీలు.

22. కుంతి.
23. ద్రౌపది.
24. ప్రభావతి.
25. లంకిని,
26. శంకిని.
27. లలిత.
28. కుముద.
29. కైశికి.






# దానవీరకర్ణ.

## ప్రథమాంకము.

దృశ్యము—కౌరవశిబిరము

శరవిద్యాప్రదర్శనము.

[ఒకవంక పాండవులు-ఒకవంక కౌరవులు-ధృత, విదు, భీష్మ, ద్రోణ, కృప, అశ్వ, కర్ణులు — ప్రవేశము.]

అశ్వ—జనకా! శస్త్రవిద్యకై నిర్ణయింపఁబడిన వీరపుంగవులందఱును విచ్చేసిరి. అస్త్రపరికరములును సేకరింపఁబడినవి. సమయము నైనది.

ద్రో—అవును. ఇఁక తడయఁగూడదు. (లేచి) ఓకురుపాండవబాలవీరాగ్రేసరులారా! యథార్థకథననిర్వచనమాత్రస్తుతి కాక పోయినచో, మీరందఱును మచ్ఛిష్యులని, వచించి, గర్వించుచున్నాను. నాయంత రత్నైకకీర్తిఁగన్న యీ శస్త్రాస్త్రవిద్యాకౌశల మెటులుండునో పరీక్షింప నేఁడీ విశాలసమప్రదేశమున, నీసమావే

శముగావింపఁబడినది. దీనిఫలితం బెటులుండునో— తెలియుటకై వృద్ధ
మహారాజునుఁదత్తరపడుచున్నవాఁడు. ఇందు శరశరాసన, గదాము
ల్లఖడ్గభల్యాది సాధనసంగ్రామంబులనారితేరిన వీరాధివీరులుగలరు.
నేఁడీవీరపూజ మన కెల్లర కమితానందప్రదమే! దీనిఫలిత మున్నతము
మంగళాంతమగుఁగాక!

భీష్మ—వత్సలారా! మాకాలములు గడచిపోయినవి! జరా
భరంబున శ్మశానము నేడో, రేపో, యనికాచియున్న వారము. మత్పౌ
త్త్రులిట్టివారని కనఁగాంచి యానందింతుము.

అశ్వ—జనకా! సమయుద్ధంబునకు వీరులంబిలువ జాలమేల?

ద్రో—ఏమియును లేదు. (భీమ॥ దుర్యో॥ ను ముందు
నకుఁదెచ్చి) కుంతిసుతమధ్యమ! —భీమసేనా! గాంధారీప్రథమ
తనూభవ! సుయోధన! ఇది కేవలము మీసామర్థ్యంబుల నెఱుంగ
నేర్పరచినవిద్యాపరీక్షగాని వాస్తవము గాదు. మీబలంబు నెల్లరు
దర్శించి పెల్లు సంతసిల్ల మల్లయుద్ధంబు సల్పుఁడు.

(భీమ॥ దుర్యో॥ మల్లయుద్ధముచేతురు.)

ద్రో—(నిలిపి) సెబాస్! కుమారవీరులారా! సెబాస్! మీ
సమయుద్ధచాతుర్యంబు మాకెల్లఱకు నానందమునుఁ గల్పించెను. మీ
యిరువురియందుఁ దారతమ్య మేర్పరుప మాతరము గాదు. ఈవీర
పూజామహోత్సవంబున మీ రిరువురు సమానముగఁ గృతార్థు
లైతిరని నేను తీర్మానించుచున్నాను.

(ఇరువురకుఁ బుష్పహారములు వేతురు. అందఱు కరతాళ
ధ్వనులు చేయుదురు.)

అశ్వ—శస్త్రవిద్య యిప్పుడు పరీక్షింపఁదగినది.

ద్రో—అవును—(అర్జునుని ముందునకుఁ దెచ్చి) [illegible]
సగులారా!



గీ. వీఁడె కృతహస్తుఁ డఖిలాస్త్రవిద్యలందు
వీఁడె యగ్రగణ్యుఁడు ధర్మవిదులలోన
వీఁడె భరతవంశంబెల్ల వెలుఁగఁ గుంతి
కడుపుచల్లఁగాఁ బుట్టినఘనభుజుండు.

ఈనాప్రియశిష్యుఁ డర్జునుఁడు తనసంగ్రామకేళిచే మనకా
నందముఁ గూర్చుఁగాక!

(పాండవపక్షజనము "జయము ధనంజయునకు జయము" అని
కోలాహలముచేయుదురు.)

ధృత—విదురా! ఇది యేమికోలాహలము?

విదు—మహారాజా! విధివశంబున నీకుఁ గన్నులులేకపోయెఁ
గాని, మహానందకరముగవీరపూజోత్సవము జరుగుచున్నది. నీకుమా
రులపరాక్రమప్రదర్శనమున మాతనువులు పరవశము లగుచున్నవి.
ఇప్పటికోలాహల మేమంటివేని వినుము—

క. భూరిభుజుం డర్జునుఁ డతి
శూరుఁడు దనయస్త్రవిద్యఁ జూపఁగ రంగ
త్ప్రారంభుఁడైన నతని న
వారితముగఁ బొగడుజనరవం బిది యధిపా.

కర్ణ—(అప) మిత్రమా! సుయోధన! ఈపాడుద్రోణుఁడు
భట్టువలె నర్జును నెటు పొగడుచుండెనో వింటివా?

దుర్యో—(అప) వినుటమాత్రమే కాదు. ఇది మనకు మహా
వమానము. పరాభవాగ్ని నాశల్యములం గాల్చుచున్నది.

కర్ణ—(అప) తొందరపడకుము. వీని శృంగభంగము చేసెదను.

అర్జు—గురూత్తముల ననుజ్ఞ వేఁడుచున్నాను.

ద్రో—అది ఈవఱకే యయినది,

(అర్జునుడు విడిచినప్రథమశరమునకు మంటలుగల్గి రెండవశరమునకు వృక్షము లాకాశమున కెగురును. అందఱు "ధనంజయునకు జయము" అని కరతాళములు చేయుదురు.)

కర్ణ—సభాసదులారా! శాంతింపుఁడు. శాంతింపుఁడు. ఎందుల కీకోలాహలము? ఎందుల కీజయనాదము. వీరకర్మ మొక్కని మొగమున వ్రాయఁబడి యుండలేదు. ఇది సకలవీరసమర్థతాసూచకమగు సభ గాని యభిమానప్రేరిత స్తుతిపాఠపాత్రము గాదు. ఈయర్జునుఁడు సల్పినశరలీల గావింపఁగలశూరు లీసభలో ననేకులు గలరు. ఇంతమాత్రమునకే మీ రేల మొగములు తెలతెలఁబోవఁ నద్భుత మందెదరు? మీ కెల్లఱకు విస్మయప్రదంబుగ నే నింతకన్న నధికచాతుర్యముం బ్రదర్శింతును. ఓనిజకథానక స్తుతిమాత్రకర్ణనప్రమోద! పార్థ!

ఆ. నేనె ఘనుఁడ నంచు మానసమున గర్వ
భావ మందవలదు; నీవు నేర్చి
నట్టివిద్య నేర్చినట్టి మహాఘను
లిచటఁ గలరు సుమ్ము నేకమంది.

దుర్యో—గురువరా! ఇది వినోదకరంబుగదా! అట్లుగావింప నిచ్చుట కాటంక మేమి?

ద్రోణు—అట్లే చేయవచ్చును.

(కర్ణుఁడు శరము విడువ పర్వతము పగులును. అందరు "వీరకర్ణునకు జయము" అందురు.)

దుర్యో—(కర్ణుని గౌఁగలించుకొని) భళీ! కర్ణా! నీపరాక్రమంబు మాకానందముఁ గలిగించె! నీవీదినము మొదలు మాకాప్తుండవై కురుకులంబునకు మేలు సేయుము.

కర్ణ—రాజాజ్ఞ కెవ్వరు విధేయులు కారు?



ధృత—విదురా! ఈకర్ణుఁ డెవ్వరోయి?

విదు—రారాజా! నేనే నీకీది వచింపనుంటిని. వినుచుంటివి గదా ప్రవర్తిల్లు కృత్యములు? నీకుమారుఁడు శూద్రపుత్రుం డగు నీకర్ణుని చెలిమి వాటించె. రారాజై మహీచక్రం బెల్లఁ బాలింపవలసినయుత్తమక్షత్రియున కీనీచునితో చెలిమి యేమి?

ధృత—విదురా! ఇప్పుడు మించినదేమి? ఇందఱిలో వాని మనంబు చిన్నబుచ్చనేల? ఏకాంతమున వీని మనంబు మరలింతము. బాల్యము గదా?

విదు—ఎప్పటి కప్పు డిట్లే యనుచుందువు. ఇది యం దెట్లు పరిణమించునో?

ద్రోణు—భీమదుర్యోధను లెట్లు సమసంగ్రామము సల్పి సమానవీరు లైరో అటులే కర్ణార్జునులును సమవీరులని మేము నిర్ణయించుచున్నారము. (పుష్పహారములు వేయఁబోవును.

కృపు—(ద్రోణుని వారించి) ధనురాచార్యా! నీనిర్ణయ మధర్మపోషితము. కర్ణార్జును లెన్నఁడును సమవీరులు కాఁజాలరు. భీమదుర్యోధనులు సుక్షత్రియులు. ప్రత్యక్షసంగ్రామపరీక్షోత్తీర్ణులైరి. కర్ణుఁడు సూతపుత్రుఁడు. అర్జునుఁడు క్షత్రియుఁడు. సంగ్రామమూ జరుగలేదు. సమవీరు లెటులగుదురు?

ద్రో—అవును. మీయాదేశమే యనుసరింపఁ బడుఁగాక! కర్ణార్జునులారా! సమాన శరవిద్యాచతురులగు మిమ్ముఁజూడ నా కానందము గలిగినది. మీ రిరువు రన్యోన్యసంగ్రామ మాచరింప వీక్షింపవలయునని బుద్ధిపొడమె. కావున నాచార్యుండనగు నాయాదేశ మిదిగో! (కర్ణుని మెడలో పుష్పహారము వేసి అర్జునునకు వేయఁబోవును.)

[కుంతి పటాక్షేపముగఁ బ్రవేశించును.]

కుంతి—నాయనలారా! ఇదియేమి కోలాహలము?

భీము — ఏమిది ? తల్లిగారిటు లేల వచ్చెను ?

విదు — అమ్మా ! కుంతీదేవి! అంతఃపురమునదలి యిటురానేల? ఇది కాంతలకరవగుప్రదర్శనము కాదు, శరవిద్యాదర్శనము.

కుంతి — ఇప్పు డీసంగ్రామ మెవ్వరికి ?

విదు — కర్ణార్జునులకు,

కుంతి — కర్ణుఁ డెవ్వఁడు ?

విదు — (వ్రేలితోఁజూపి) ఈతఁడే; రాధాపుత్రుఁడు.

కుంతి — రాధాపుత్రుఁడా ! ఈతఁడేనా కర్ణుఁడు ?

విదు — అట్లు కన్నుల నీరేల గార్చెదవు ?

కుంతి — ఏమియును లేదు. నాతండ్రి బిడ్డలకును వైరమా ?

విదు — నీతండ్రి బిడ్డ లెవ్వరు ?

కుంతి — ఎవ్వరును లేరు. విధిప్రాతికూల్యము............ విదురా ! ఈసంగ్రామ మాపఁబడదా ?

విదు — అటు లేలజరుగవలెను ? శరవిద్యాదర్శనముగదా !

కుంతి — హా ! పరమేశ్వరా ! నేనే పాపాత్మురాలను.

(మూర్ఛిల్లును.)

ధర్మ — ఏమీ చిత్రము ?

భీము — ఇట్టియున్మాదము మాయమ్మకుఁ గలుగునే ?

అర్జు — విదురా ! ఇ దేమైయుండును ?

విదు — ఏదియో వ్యాధిలక్షణమని తలంతును. మీజనకుని మరణానంతరము నీమె కప్పుడప్పు డిట్టియున్మాదము గల్గుచుండునని మీరే వచించియుంటిరిగదా !

ధర్మ — అవును.

విదు — ఓసీ ! కైసికీ !

కైసి — (ప్ర) ఏమిసెలవు ? (నేలపైఁజూచి) అయ్యో ! పూజ్యురాలగు కుంతీదేవి —



విదు — ఈమె నంతిపురికిఁ గొనిపోయి చికిత్స చేయింపుము.

కైసి — (కుంతితోఁ నిష్క్ర)

విదు — ధనుర్వాచార్యా! ఇఁక వీరగోష్ఠి యారంభము గావచ్చును.

ద్రోణ — ధనంజయా ! ఇదె పుష్పహారము కర్ణునితో సమయుద్ధ మొనరింపుము — (మెడలో వేయఁబోవును.)

అర్జు — (ఆటంకపఱచి) ఆచార్యా ! క్షమింపుము.

ద్రోణ — ఏమి ?

అర్జు — కర్ణునితోడ సమయుద్ధము నాకు సరిపడదు.

ద్రోణ — ఏమి ? అతఁడు శౌర్యవిహీనుఁ డనియా ?

అర్జు — కాదు.

ద్రో — సమానుఁడు కాఁ డనియా ?

అర్జు — కాదు.

ద్రోణ — శరవిద్యాచతురుఁడు కాఁడనియా ?

అర్జు — కాదు.

ద్రోణ — ఇంకేమి?... ఉత్తమవంశీయుఁడు కాఁ డనియా ?

అర్జు (ఊరకుండును).

ద్రోణ — ఓహో ! తెలిసె. సూతపుత్రుఁ డగుకర్ణుతోడ రణ మొప్పమి నీ విట్లు పలికియుందువు. పార్థా అంతేకదా !

అర్జు — చిత్తము.

ద్రో — అట్లయిన నేను నాయాదేశమును మరల్చుకొనుచున్నాను.

కృ — కర్ణా !

గీ. కురుకులంబునందు గొంతికి తనయుఁడై
భవ్యజాతుఁడైన పార్థుతోడ
రణము సేయ నీకు మనసయ్యెనేని నీ
కులము దెలిపి పిదపఁ గొనుము శరము.

దుర్యో—ఆచార్యా! అవమానపూరితంబులగు నీపోటు మాట లేమిటికి? క్షత్రియులు దక్క సంగ్రామ మొనరించువారవ లధమకులంబుల లేరా? వారలు రాజులకు సాయంబుగారా? క్షాత్రంబు నెఱపునెడల కులగోత్రవిచార మేటిన్యాయము?

విదు—ఓయీ! సుయోధనా! పెద్దలు చెప్పినచొప్పునఁ బ్రవర్తించుటే నినుబోటివారికి హితంబుగాని యీరీతి నొకయల్పుని కొఱకై తాతలం దృణీకరించుట నీతికాదు. కులగోత్రంబు లెఱుంగక నీవు రాధేయునితో స్నేహంబు సల్పితివిగాక! సంగ్రామ మొనర్ప పెద్ద లనుమతింతురే?

దుర్యో—విదురా! గురివెందగింజసామ్యముగ నీ వేల లేని పెద్దరికంబు వహించి పరిహాసింపఁబడెదవు? నాతండ్రితో నెయ్యంబు సలుప నీవుమాత్రము శూద్రుఁడవుగాక—క్షత్రియుండ వైతివి కాఁబోలునేమి?

కర్ణ—సుయోధనా! నాకొఱకై నీ కేల శ్రమ. (సవినయముగ పుష్పహారముందీసి) ఆచార్యా! పుష్పహారము నిష్ఫలమైనది. ఇది సూతపుత్రునిశరీరస్పర్శచే కళంకితమైనది. (అగ్నిలో వేయును.)

దుర్యో—కర్ణా! శాంతింపుము. సూతజాతావమానదుఃఖమున పవిత్రపుష్పహారము నగ్నిహోత్రమున వైచెద వేమి?

కర్ణ—మిత్రుఁడా! సుయోధనా! ఏల వైచితినా? ఏల వైచితినో నీవు గ్రహింపఁ జాలవా? కురుపాండవ యోధవీరాగ్రేసర, సమధిష్ఠితమహాసభామధ్యంబునం గల్గినయవమానభరంబున వైచితిని. నీచకులసంభవదుర్యశోత్పన్నమగుమహాగ్ని శరీరము నాపాదమస్తకమునుం గాల్చినందున వైచితిని. శాత్రవ పరిహాసప్రతీకారమున కీసభలో లేశమైన నెడము లేక పరితాపదుఃఖమును కంఠమునసే దిగమ్రింగి వైచితిని. నిరర్థకములగు శరచాపంబులం దాల్చినపౌరు



షహీనునకు పుష్పహారాలంకార మేటికని వైచితిని. మిత్రమా! కురురాజా! వేయేల? నీకు మిత్రుఁడనుగా నుండఁదగనని వైచితిని.

దుర్యో—(రోషముతో) ఆఁ! కర్ణా! ఏమంటివి? కౌరవసామ్రాజ్యధురంధరుఁడ నగునాకు ప్రియమిత్రుండవైన నీ కవమానమా! నీచకులసంభవమహాదుఃఖాగ్నియా! నీశరచాపములు నిష్ఫలములా? నీవు నాకు మిత్రుండవే గాఁదగవా? ఛీ ఛీ అట్లేయయినచో నాజీవితంబువలన లాభ మేమి? నామైత్రికి ఫలమేమి? అశేషరాజ్యవిభవపట్టభద్రుఁడు-కౌరవరాజ్యలక్ష్మీధురంధరుఁడు సుయోధనుండు—స్వల్పమైన తనప్రాణమిత్రునియవమానదుఃఖము దీర్పఁ జాలఁడా? ఓసభాసదులారా! ఓభీష్మద్రోణకృపాశ్వత్థామవిదురాదులారా! పాండవులారా! మీరంద రాలకింపుఁడు

గీ. నృపకులోదయుఁ డగుపార్థు నెదిరి పోర
నృపుఁడె వలయు నటంచెద నొంతు రేని
యంగరాజ్యదానమున నాయనుఁగుమిత్రు
సధిపుఁ జేసితి నందఱియెదుట నిపుడె.

ఏనా మిత్రుఁడు నీచవంశసంభూతుఁడనియు రాజన్యునితోడ నన్యోన్య శరసంగ్రామమున కనర్హుఁడనియు నీసభలో స్పష్టమయ్యెనో యాకర్ణునకు నే నిదే సామ్రాజ్యదానముఁ గావించి రాజుం జేసితిని. నాయంగరాజ్యము నీతఁడు పాలించుఁగాక!

(శిరమున కిరీటముంచును. కరతాళములు)

క—(వినయముతో) రాజాధిరాజా! దుర్యోధనా!

మ. చతురంభోనిధి మేఖలాఖిలమహాసామ్రాజ్యరాజన్యభూ
షితకౌరవ్యసభాస్థలంబున మహాస్నేహంబు వాటించి, సం
తతసౌఖ్యప్రదమై నృపాలసముదాత్తంబైనరాజ్యాధికా
రతరశ్రీల నొసంగితౌర! యనివార్యంబైన దర్పంబునన్.

ఇందులకుఁ బ్రతిగా నీ కేమిసమర్పింతును?

దుర్యో—నిరుపమానమైన నీవాల్లభ్యము చాలును. ఈదినంబు మొదలు నా కిష్టసఖుఁడ వై యుండుము.

కర్ణ—మహాప్రసాదము

వి—ఓయాంబికేయ! క్షత్రియపుత్రవిరుద్ధంబుగ నీకుమారుం డొనరించునీనింద్యకర్మంబును నీ వెట్లు సహించుచున్నావు? నీసుతున కీకర్ణునితో మైత్రియే నీకులంబునకు నాశనంబును సూచించుచున్నది. అన్నదమ్ములవిరోధంబులు పెంపొందింప మూలకందమై యీమైత్రి సంఘటిల్లె ఇంకనైన నీదురాగతంబు వారించి నీకులముఁ గాపాడుకొనుము.

ధృత—విదురా! ఇప్పుడు వలదంటినిగాదా!

విదు—చేతులు కాలినపిదప నాకులతో పనియేమి?

భీము—(కర్ణునిఁజూచి సాక్షేపణముగ) ఓరోరి రాధేయా! రథకారహీనకులసంభవ! నీవఁటరా సుయోధనునకు నేస్తకాఁడవు? ఈకురుకులంబుఁ గాపాడుభారము మే మందఱముండఁగా నీపైఁ బడియెఁగా? ఎంతపాపకాలము సంభూతమైనది? అర్జునుని గెల్చునది నీవా? భళి భళీ!

గీ. నీకులంబున కిరవగునీతిచేత
నాకప్రతోదముఁ గొనివేడ్క నాగలమీఁద
సూతకృత్యంబు సలుపుము; నీతిమాలి
పార్థుతోఁ బోరు సలుపు దుర్భావ మేల.
అదిగాక,

గీ. ఉత్తమనృపాలకప్రవరోపభోగ్య
మైనరాష్ట్రపాలనము నీ కర్హ మగునె?
మంత్రపూతమై గురుయజమానభక్ష్య
గురుపురోడాశమును దిన కుక్క కగునె?

కర్ణ—(తలవంచును.)



దుర్యో—వృకోదరా! మీరమీఁద వైరంబు పెంచుట నీకు తగవుగాదు. నరహస్తగతంబగుపౌరుషంబును సాటిగా నెంచవలయుఁ గాని జాతమున కేమి? అది దైవాధీనము. దేవేంద్రాయుధమై వృత్రనాశకహేతుభూతంబైన వజ్రము దధీచియెమ్మునం గలిగెను. అదియుఁగాక అట్టిదివ్యతేజఃకలితుం డథమాన్వయుం డని పలుకుటకు నయితము నాకు నోరువచ్చుట లేదు.

విదు—ఓదుర్యోధన! సాధుత్వంబు వదలి వాదంబున కియ్యకొనుచుంటివి. ఇందఱు పెద్దలుండ నందఱ నిరాకరించి పిన్నతనంబని తలంపక పెద్దతనంబు పైకొని రాజ్యదానంబులు సల్పుట నీమేలునకు గాదు. నాహితము వాటింపుము. మొక్కగానున్నపుడే వంచవలయుఁ గాని చెట్టయినపిదప ఛేదింపలేము. హీనజాతుల నందలమెక్కించినం దువలనఁ గలుగుదుష్ఫలంబు భవితవ్యంబున నీవలన ననుభూతంబగు. పడుచుదనంపుగర్వంబున నెంతదోఁచిన నంత గావింపకుము.

దుర్యో—ఓదాసీపుత్ర! కర్ణునకు మారుగని న్నేల మాయింటనుండి వెడలఁగొట్టఁగూడదు. నీ కేటి కీయోర్వలేమి? మాపై జనకునితో లేనిపోనికొండెములం బల్కు నీవు శిక్షార్హుండవు. అంగరాజ్యమే కాదు. ఈ సమస్తరాజ్యంబును నే నీకర్ణున కిచ్చినను నన్నునువాఁ డెవ్వఁడు? కర్ణా! ఓర్వఁజాలనితులువలు కన్నులుపొడుచుకొనిచచ్చినఁ జావనిమ్ము. నే నున్నంతవఱకు నీకు భయములేదు. మన మిందుండఁ జనదు రమ్ము. (సభ్యులం జూచి దర్పముతో కర్ణునిఁ గౌఁగలించుకొని నిష్క్రమించును.)

ధృత—విదురా! ఈయలజడికి శిరోబాధగల్గుచున్నది. నన్ను మందిరాంతరమునకుఁ గొనిపొమ్ము.

విదు—చిత్తము (ధృతరాష్ట్రునితో నిష్క్రమించుచున్నాఁడు.)

భీష్మ—నేఁటి కీయానందము చాలును. మనమును పోవుదము రండు. (అందఱును నిష్క్రమించుచున్నారు.)

---



# దానవీరకర్ణ.

ద్వితీయాఙ్కము.

—♦—

౧ వ దృశ్యము — ఉద్యానము.

(ప్రభావతి చెలులతో ప్రవేశించును.)

ప్రభా — చెలీ! లలితా! తూర్పుదిక్కునఁ బరికింపుము. బాలభానుపుత్రుఁడు ప్రాచీదిశాసింహాసనపట్టభద్రుఁడై లోకజైత్రయాత్రార్థము జగన్మంగళకరముగ బయలుదేఱుచున్నవాఁడు.

మ. అదిగో! లోకజనప్రమోదతరచండాదిత్యతేజంబు; స
ర్వదిశావిస్ఫురితసారసద్విజకులారావంబు లాశీస్సులై
ముదమేపార వినంగ సమ్మోదకిరణ్మార్గస్వరత్నావళీ
సదృశంబై యుడుకోటి యొక్కొకటిగా జారెన్ ధరామండలిన్.

లలి — అమ్మా! నీపలుకులు సూర్యపుత్రుఁడును నీపతియు నగు రాధేయునివిజయమును సూచించుచున్నవి.

కుముద — సాధ్వీశిరోరత్నమవగు నీనోట నసంబద్ధవచనములు రాఁజాలవు.

లలి — అందుచేత సుయోధనాత్మీయుఁడగు నీపతి విజయముతోడను విభవముతోడను హస్తినాపురమునుండి వచ్చునని తోఁచుచున



ప్రభా — చెలులారా! తెల్లవాఱుజామున స్వప్న మిటులే వచ్చినదిసుండీ!

లలి — శుభస్వప్నములకదియే మంచిసమయము. ఏమని స్వప్నము గంటివి?

ప్రభా — సుప్రసన్నదరహాసభాసురముగు ప్రాణేశ్వరుఁడు ముఖమండలమున శిరఃకలితదివ్యమకుటస్థనవరత్నకాంతిపుంజములు దీపించుచు వింతసొంపు నిచ్చుచుండ శ్వేతవర్ణమందేభము నధిరోహించి దివ్యకుసుమాలంకారశోభితుఁడై పురవీధుల నరుగుదెంచుచున్నటులును సౌధాగ్రసీమలయందు పురంధ్రీజనములు నిలచి లాజాక్షతలచే తన్మూర్ధము నభిషేకించుచున్నటులును పార్శ్వయుగళంబున నాత్మీయపరివారములు నిలచి ఛత్రచామరంబులు బట్టుచున్నటులును కలగంటిని.

(తెరలో కాహళధ్వనియగును.)

లలి — ప్రభావతీ! ప్రభావతీ! నీయదృష్ట మసమానము. రాజలాంఛనమగు కాహళ మప్పుడే మ్రోఁగుచున్నది! నీపతి తప్పక రాజ్యాధికారప్రాప్తి నంది వచ్చుచున్నవాఁడు.

ప్రభా — ఓసీ! యీపరిహాసములు చాలింపుఁడు.

కుము — లలితా! మనయూహ నీమె పరిహాసముగ భావించుచున్నది. కావున మన మీశుభసన్నివేశవాస్తవకథను పరిపూర్ణముగ నెఱింగి నిర్వర్తితసంశయులమై వచ్చెదము గమ్ము.

లలి — అటులే కానిమ్ము.

ఇరువురు నిష్క్ర)

ప్రభా — (నిమిత్తమును సూచించి) అయ్యారే! ఏమి యీనిమిత్తము? మంగళభావిసూచకమగు నీనిమిత్తమునకును చెలుల యూహకును నాస్వప్నమునకును వినఁబడినజయనినాదమునకును సరి

పోయినది హృదయేశ్వరునిజాతకమున రాజ్యపాలనప్రాప్తి లిఖింపఁబడియుండు టిదివఱకే జ్యోస్యులవలన వింటిని అదిగాక ;

ఉ. సూతుఁడు గాడు నావతి విశుద్ధకులీనుఁడు గాని, రాజితా
రాతివిదారణాసమపరాక్రమవీరుఁడుగాని సేవక
వ్రాతముఖుండుగాఁడు; బుధరంజితగుప్తము తచ్చరిత్ర; వి
ఖ్యాతము గాఁగ నెప్పుడో బయల్పడకుండునె? చిత్రవైఖరిన్.

(లలి, కుము సంభ్రమమున ప్రవేశింతురు.)

లలి—కుముదా! ఈశుభవార్తచే లభించుబహుమానము నీకు సగము. నాకు సగము.

కుము—అటులయిన వార్తానివేదనము నటులే యుండవలయు.

లలి—సరే రమ్ము. నీవు సగము, నేను సగము నివేదింతము.

ప్రభా—చెలులారా! ఏమైనది?

కుము—నీ మొగము చేటంత యైనది!

లలి—అంగరాజ్యము నీమగని కైనది!

కుము—నీవు దాసికి రాణివైతివి!

లలి—నీమగఁడు దాసికి రాజయ్యెను.

ప్రభా—ఏమి? మీరు నిజము చెప్పుచున్నారుగదా!

లలి—నిజనిజము. ఈమాట నీవు స్వయముగా తెలిసికొన వచ్చును. కాని యిప్పుడు తడవులేదు రమ్ము.

ప్రభా—ఎక్కడికి?

కుము—ఉత్తమగజంబు నవతరించి మందిరాంతరమునకు రాఁబోవునీమగని నెదుర్కొని సన్మానించుటకై పుష్పమాలికలును నీరాజనములును గొనినత్తము రమ్ము. (అని లాగుచున్నారు.)

ప్రభా—నన్నట్లు పడలాగెదరేల? నేనే వచ్చెద నుండుఁడు.

కుము—నీ యాలస్యమునకు తగినవిరామము లేదు నిన్ను లాగుకొనియే పోవుదము రమ్మ.



లలి—రేపు రాణివైనపిదప మమ్మెట్లు సన్మానింతువో? స్వతంత్రము గలిగినపుడే మాచనువులు సాగించుకొందుము.

(ఇద్దఱు ప్రభావతిని లాగుకొనిపోవుదురు)

[తరువాత సేవకద్వితీయుఁడగుకర్ణుఁడు ప్రవేశము.]

కర్ణ—సేవకా! నామన స్సీయాడంబరోత్సవములను గోరుట లేదు. కొంతతడవు నేను శాంతముగ నుందును. పరివారమును దూరముగఁ బొమ్మని చెప్పుము. మంగళవాద్యములను నిలుపు మని పలుకుము.

సేవ—మహాప్రసాదము. (నిష్క్ర.)

కర్ణ—(విచారముతో) పౌరుషవంతుఁ డెప్పుడును శాత్రవకృతావమానమును భరింపఁజాలఁడుగదా!

శా. రెండే దారులు వీరలోకమున కుర్విన్ శత్రురాజన్యు ను
ద్దండోగ్రాహవభూమి గూల్చి జయసంధానంబు గన్గొంటయో
ఖండింపంబడి సారవీరసురసౌఖ్యశ్రీలనుం గాంచుటో
యొండౌరీతి మహావమాన మగుచో నొప్పౌ స్వయంనాశమే.

ఏమిచూచుకొని పాండవులు గర్వించి నను తృణీకరించిరి? రాజ్యమా రాదు! బలగమా లేదు. భీముఁడు తనయొడలిబలము చూచుకొని పొంగెనుగా? పార్థుఁడు శరవిన్యాసములకు గర్వించెఁగా? పార్థునిగర్వ మణంచితిని! కాని భీమునిపోటుమాటలు మనంబును బాయవయ్యె! సమయయుద్ధమునకు సమ్మతింపనిపార్థునిత్రుళ్ళిపాటు సహించి యుందును. కాని హీనకులప్రశంసతో సగము క్రుంగితి! సుయోధనాంగరాజ్యదానంబున విరోధులు మాన్పడి నోరు మెదల్పఁజాలక పోయిరనుమాటయే కాని నామనంబునందలిపరిభవాగ్ని చల్లారదయ్యె. బహుజనపరివేష్టితసభామధ్యమున కులీనుండను గానని నిరాకరింపఁబడియు మొండివలె జీవించితి. ఛీ! ఛీ! ఈవైభవంబులు నిరర్థకములు. ఈరాజ్య మపూజ్యము! రథకారకులంబున జనించి రాజ

నామము దాల్ప నాచేతము సమ్మతించుట లేదు. ఈ యవమాన మునకన్న నాకు మరణమే శ్రేయము! తీవ్రనిజశ్రీఘాతసదృశము లగు శత్రువాక్యాహతులచే నిదివఱకే శిరచ్ఛేదము చేయఁబడిననాకు మృతిచింత యేల? ఇట్టి నిరర్థకజీవనమును దాల్చి రాజనైననా కేటి కీర్తి? సూతరాజాధముం డని పలువు రాడుటకన్న నాకవమాన మేమున్నది? కావున నీచంద్రాయుధముచే మరణించెదఁ గాక! (పొడుచుకొనఁ బోయి మరల శాంతించి) విబుధు లాత్మహత్య పాప మని చెప్పుదురు. బుద్ధిపూర్వకముగ నే నింతదనుక నొనరించిన పాపములు లేవు. నేఁటి కీదుర్ఘటఘటన మేలగలుఁగవలయు? పరమేశ్వరా! ఈయవమానదుఃఖనివారణమున కేది యేనిమార్గము దోఁప జేయుము.

ప్రభా—సేవకుని మాటలను బట్టి చూడ నాథుని హృదయ మాకులమై యున్నట్లు తెలియుచున్నది. అంగరాజ్యప్రాప్తపరితృప్తులైన యార్యపుత్రులకు విచారమును గలిగించినమహాత్కార్య మేమో తెలిసికొందును. [చాటున నుండును]

కర్ణ—(తలపంకించి)

గీ. తగుసభాపూజనములందఁ దగినవాఁడె
మానవంతుఁ డౌ; నాతఁడే మానవుండు
మానహీనుని భరియింపఁ బూను నెడల
భార మవనికి మాతృగర్భంబునకును.

ఇట్టిజీవితమును భరించి జీవించుటకన్న నాత్మహత్య దోషము కాదు. కరవాలమా! కర్ణజీవితకళంకమును జీవితములతోఁ బాపి పుణ్యముఁ గట్టుకొనుము. (పొడుచుకొనఁ బోవును)

ప్రభా—(కరవాలము వారించి పుష్పహారముచే నలంకరించి) నాథా! ఇదేమిసాహసము? శాంతింపుఁడు! శాంతింపుఁడు.

కర్ణ—ఎవరు నన్ను వారించునది?



ప్రభా—మీహృదయేశ్వరి ప్రభావతి.

క—ఏటికి వారించితివి?

ప్రభా—నామాంగల్యమును నిలుపుకొనుటకు.

క—ఈపుష్పహార మేమిటికి?

ప్రభా—అంగరాజ్యలాభమునందినమీకంఠసీమ నలంకరించి సన్మానించుటకు.

క—ఛీ! నా కింక సన్మానమా?

క. మానముఁ బాసిన నను స
న్మానము గావింపఁ దలఁతు మానినికో యీ
ప్రాణము ఘనమటవె? తృణస
మానముగాదగదె దురవమానము గాఁగన్.

ప్రభా—ఇట్టియవమానము మీ కేటికి గలిగెను?

క—ఏల కలుగదగును? ఒకచేత గాలమును వేఱొకచేత వలయు ధరించి చేపలుబట్టుకొని జీవింపవలసిన జాతనుగల నేనుతగుదునని శరచాపములు ధరించి పదువురిలో దిరుగుటయే యవమాన కారణము.

ప్రభా—ఇట్టి మీకులధర్మనిరూపణ మొనరించి యవమానించినయభిజాతునినామధేయమును విన దలఁతును.

క—ఎవరున్నారు? పాండవులు.

ప్రభా—ఆహాహా! పాండవులయాభిజాత్య మడుగవలయునా?

ఉ. ఏవురుభర్తలం గనినయింతికి కుంతికిఁబుట్టి యొక్కొకం
డేవురుతండ్రులం గనుట హీనతగాక కులీనులంట రా
ఘావనితాకుమారులయి తల్లిని దండ్రిని గల్గినట్టిమీ
రీవిధిహీనులంట! భళిరే! యిక నేమనిచెప్ప ధర్మమున్.

ఇందులకా మీ రీయాత్మహత్యాయత్న మొనరించుట ! చాలుచాలు! ఎవరైన విన్న నవ్విపోయెదరు!

క—జీవితేశ్వరీ ! నీవు పాండవుల నైచ్యమును ప్రకటింపఁ గలవు గాని నాజన్మము నుత్కృష్టమొనరింపలేవు గదా ! అది గాక పదువురిలో నాకవమానము జరిగిపోయినది. అందుచే మనమెంతసమర్థించుకొన్నను నామనంబు శాంతివహింపదు.

ప్రభా—నాథా ! గంధసింధురసార మేయన్యాయముగ పాండవులు మిమ్ము మాటలచే నవమానపఱచుట మీకుచిన్నతనము గాదు. పౌరుషమునకు జాతియు కారణము గాదు.

గీ. జగము లన్నియు వెలిగింపఁ జాలి మింట
నున్నతుండైన భాస్కరుఁ డుష్ణదీప్తి
తృణమునైనను దా వెలిగింపఁ గలఁడె ?
జగములను గాల్ప దీపంబు చాలుఁ గాదె ?

గురివెందగింజ తన నలుపెఱుఁగనట్లు పాండవులు మిమ్ము కులము తక్కువవారని దూషించిరా ? మీజనని రాధవలె కుంతి నిష్కళంక చరిత్రయా !

కర్ణు—కుంతి ధర్మసంతతి గాంచుట దోషరహితమని వ్యాసాదులు సమ్మతింపలేదా ? అట్లైనచో కురుకులంబెల్ల నిట్లే యగును.

ప్రభా—ధర్మసంతానదాత యగువ్యాసుఁడట్లు సమర్థించుటలో తప్పేమున్నది ?

క—ప్రేయసీ ! అట్లు పలుకుట మహాదోషము. తెలియమిచే నీవట్లంటివి. వేదవ్యాసుఁడు ధర్మాతిక్రమణ మొనర్పఁడు. కుంతిపాతివ్రత్యమున దోషము లేదు.

ప్రభా—నాథా ! అట్లు కుంతి పతివ్రతయే యగునేని పాండవులవలె మీరును సత్కులీనులే యని నాయంతరాత్మ బోధించు



చున్నది. హీనకులీయు లెన్నఁడును మీవంటివారు కాఁజాలరు. జగత్సాక్షియై నభంబు వెలిగించు భాస్కరుఁడే యిందులకు సాక్ష్యము.

(ఆకాశమున సూర్యుఁడు దృశ్యమగును.)

సూర్యు—కుమారా ! కర్ణ ! నీసతియగు ప్రభావతి మహాపతివ్రత. ఆమె భావన మన్యథా కాఁజాలదు. నీవు హీనకులుండవు కావు. కుంతికిని నాకును జన్మించి జలంబుల విడువఁబడి, రాధకు పెంపుడుబిడ్డఁడవైననీవు పాండవాగ్రజుండ వగుదువు. నీకు చింతకు గాని, యాత్మహత్యాయత్నమునకుఁ గాని కారణము లేదు. దానకర్ణుఁడవైననీవు జగద్విఖ్యాతి నందఁగలవు. నీకు శుభమగుఁ గాక.

కర్ణ & ప్రభా—దేవా ! కృతార్థుల మైతిమి.

(నమస్కరింతురు.)

[తెరవ్రాలును.]

4 దృశ్యము—పరశురామాశ్రమము.

[కర్ణుఁడు సాలోచనముగ ప్రవేశించును.]

క—(తనలో) ఇదియే యుక్తమని నామదికిఁదోఁచినది. ఏమనిన,

గీ. ధర్మమో, యధర్మమొ, యథార్థంబొ, కాక
కల్లయో, విద్య నార్జింపఁ గడఁగువాని
కరమరగఁ జింతసేయ నక్కఱయె లేదు
కార్యనిర్వాహణమె భువి ఘనతరంబు.

కావున, నబ్రాహ్మణుఁడ నయ్యు, నీదృశబ్రాహ్మణవేషంబున నేను భార్గవుండగుపరశురాముని వంచించి శరవిద్యాభ్యాసము చేయుట యకార్యంబు గాదని సమర్థించుకొనుచున్నాఁడను. అయినను యీమహానుభావుని క్రోధానలంబున భస్మీభూతులైన క్షత్రియులోకకథానకంబు నామదిఁ జొచ్చి యప్పుడప్పుడు భీతిఁ గొల్పుచుండును. అయినను భయము లేదు.

క. వేషం బెంతటి కపటమొ
భాషణములు నంతికన్న బటుకపటములై
యీషణ్మాత్రం బేఁయు
దోషము దోషింపవయ్యొ దురితములయ్యెన్.

(తెరలో)

కౌండిన్యా! కౌండిన్యా! గురుపాదులకు నిద్రాసమయమయినది. శిష్యు లెవ్వరును సమీపమున లేరు.

క—ఓహో! గురులయెడ నపచారము జేసితిని. దాండా యనా! ఇదె వచ్చితిని. (నిష్క్రమించును.)

[పటాక్షేపమున నింద్రుఁడు ప్రవేశించును.]

ఇంద్రు—ఓరీ! కపటాత్మా! కర్ణ! ఎందుఁబోయెదురా? గురుద్రోహీ! పూజ్యుఁడగు భార్గవుని వంచించితివని ముఱియు నీయెగసిపా టణంప నింద్రుండనగు నేన వచ్చితిని. శూద్రునకు దేశికుండనుగానను ప్రతినగల పరశురాముని వంచింప విప్రవేషంబు బూనితివటరా పాపీ! చూడు మిదె నీగుట్టు బట్టబయలుగానున్నది. ఈ యత్న మంతయు నాతనయుఁ బార్థుఁ బరిమార్చుటకెగా? త్రిలోకాధిపతినగు నాతనయుఁ డర్జునుండు సూతకులాధముండవగు నీచే వధింపఁబడునే! (అటు నిటుఁ జూచి) అల్లదే? పరశురామదేశిక సహితుండగు కర్ణుండు. నేనిం దుండరాదు. ఇప్పుడీపరశురాముఁడు కర్ణునితొడపైఁ బరుండి సుఖనిద్రఁ జెందును. నేనొకపిపీలికాకృతిఁ దాల్చి కర్ణుని యూరుభాగముం దొలఁచుచుండెద. ఆబాధనుసహింపగల వీఁడు విప్రుఁడుగాఁడని పరశురామునకు సుబోధముగ నెఱుంగనగును. [నిష్క్రమించును.]

---



[కర్ణ పరశురాములు ప్రవేశించుచున్నారు.]

పర—వత్సా! ప్రకృతి వ్యత్యస్తముగ మాఱిపోయినది. కావుననే తత్పరాక్రమ మిప్పుడు నశించిపోయినది. వీరలోకమేగొడ్డుపోయినది. అందుచే నీవు నాకడ నేర్చిన శరవిద్య యంతయు నిరర్థకమయిపోవును సుమా!

క—(స్వగత) అశ్లీలము హతమగుఁగాక! ఏమిది దేశికుఁ డిట్లనుచుండెను. (ప్రకా) విప్రోత్తమా! (తనలో) అయ్యో! తప్పాడితిని. (ప్రకా) గురూత్తమా! ఇటులాడనేల?

పర—ఇటులాడితినన్నఁ దప్పేమున్నది?

ఉ. కూళయొకండు తండ్రితలఁ గోయ చలంబున రాజరూప చం
డాలుర నెల్ల దారుణరణంబున గూల్చితి నెత్తురేర్లు గాఁ
గేలను గాజు లట్టె తొడిగించుక దూరిరి వంటయిండ్లలో
బేలక! నాఁటనుండి ఘనపౌరుషవంతుఁ డొకండు పుట్టెనే?

క—(తనలో) ఓహో! ఈతని నోడించినశ్రీరామచంద్రుడును, భీష్ముఁడును క్షత్రియులైరి కారుకాఁబోలును? (ప్రకా) తమ పరాక్రమము దిశాంతంబుల నిండి నిబిడీకృతమైనదియే.

పర—నన్ను గెలువలేక యోడినక్షత్రియాధములవంటి నడవీనుంగులైన నిప్పు డొక్కఁడైనఁ గలఁడా? విద్యుచ్ఛకపై బ్రహ్మాస్త్రమునున ట్లీనృపకీటకములకొఱకా బ్రాహ్మణుఁడవైన నీకీశరవిద్య!

క—(తనలో) బ్రాహ్మణుఁడవైన అనుట నాకపటాకృతినిఁ గుర్తించియై యుండునా! కాదు. కాదు. ఇది నావిభ్రాంతి. (ప్రకా) దేవా! పరశురామశిష్యుఁ డఖిలాస్త్రవేదియనుకీర్తికొఱకే కాని యీశరవిద్యాభ్యాసము నాకొఱకు కాదు.

పర—అటులయిన మా కానందమే! నిరుపయోగము లే

యయినను సర్వవిద్యలు నీవు నేర్చుకొంటివని ఖ్యాతిచే నేను ముదిత హృదయుఁడ నైతిని. (ఆవులించి) ఇప్పుడు నాకన్నులనిండ నిద్ర వచ్చుచున్నది.

క — నాయంకభాగమునఁ దలనిడి నిద్రింపుఁడు.

పర — (యథోక్తముగ నిద్రించును.)

క — (తనలో) ఔరా ? బ్రాహ్మణేతరులన్న నీభార్గవున కెంత దురాగ్రహము ! ఈతనికడ నావిద్యాభ్యాసము వ్యాఘ్రగృహాంతరాళనివాసితహరిణశాబకముఁబోలియున్నది. ఈతఁడు నేను శూద్రుఁడనని గురుతింపకమున్నిచ్చటినుండి కదలుట క్షేమము. సమస్తవిద్యారహస్యంబులను బ్రాహ్మణవేషంబున నేర్చుకొంటిని. ఈతఁడు నిద్దుర లేచిన వెంటనే కొండొకనెపంబుఁ గల్పించుకొని వెడలిపోయెదఁగాక !

ఇంద్రు — (ప్రవే, తిరస్కరిణీవిద్యచే నే నిప్పు డెవ్వరికిం గనఁబడుట లేదు ఇఁక నాపనియుం బూండెద. (నిష్క్రమించును.)

క — (బాధ నభినయించుచు) ఔరా ! ఏమిది ; నాకాలిక్రింద నేదియో పురుగు ప్రాఁకుచున్నది. ఓహో ? ప్రాఁకుటయే గాదు. తొలుచుచున్నది. అబ్బా ? వృశ్చికాఘాతమట్లిది క్షణక్షణమును వృద్ధియై నఖశిఖపర్యంతమును భగ్గుభగ్గున మండుచున్నది. ఇది యల్పకీటకమాత్రంబైన నిటు లుండునా ?

గీ. పాదమూలంబు కదలిన భార్గవుండు
నిద్ర చెడెనని నాపై నుదగ్రకోప
తామ్రలోచనుఁ డగు; శాంతిదాల్తుమున్న
భగ్గుభగ్గునమండు నా పాదతలము.

అరరె ! ఏమాశ్చర్యము ! ఒకపురుగేమి ? ఘనభుజాసారుండ నగు నాధైర్యంబు చెడఁగొట్టఁ గుట్టుటేమి ? ఇది నాశరీరంబునం దూరి రక్తమాంసములను బయటకు గ్రక్కించుచున్నది. శల్యాశల్యాంతర



ములం దూరి మూల్గుల నాహారించుచున్నది, ఏమిచేయుదును ? ఓహో ! నెత్తురేరును ప్రవహించుచున్నది. ఈరక్తంబుచే దేశికుని వస్త్రంబులు తడిసినవి. ఏమైన సరియే కాలు కదలనీయను.

క. సాయకతుల్యము కీటక
మా ? యిది ? కడతేర్చె రక్తమాంసంబుల నీ
మాయ యనూహ్యంబై దుర
పాయంబై తోఁచె తీరుభంగి యెటులొకో.

(గురువుం జూచి) ఔరా ? ఈమహాత్ముఁడు లేచుచున్నటు లున్నది. పౌరుషంబుననో, గురునిపై భక్తిపెంపుననో, శాపభయంబుననో, ఎటులైననేమి ? ఇంతవఱ కీగునసంపుటాఘాతంబుమీరు కీటకబాధ సహించితిని కాని, యీతఁడు లేచినవెనకఁ దనశరీరంబు రక్తపంకిలమగుట కెంతదురాగ్రహము బూనునో యని నామనంబు డోలాందోళితమగుచున్నది.

పర — (కదలును)

క — గురూత్తమా ! నిదురింపుఁడు.

పర — (శయ్యాయంతయు తడవుచుండును,)

క — (తనలో) ఓహో ! ఈతఁ డప్పుడే రక్తముం బసికట్టినాఁడు.

పర — (విస్మయముతో లేచి శయ్యచూచును.)

క — (లేచి) మహాత్మా ! ఏమిది ! ఆశ్చర్యచకితులై నిద్దురలో లేచితిరి ! ఏదైన దుస్స్వప్నము మీమనంబునఁ గలఁతపఱచియుండునా ?

పర — ఇదియేమి ? ఈరక్త మెక్కడిది ?

క — (భయపడుచు) తెల్పుటకు నోరు రాకున్నది !

పర — ఛీ ! దురాత్ముఁడా ! గురుద్రోహీ !

చ॥ జనవరహీనశోణితవిశాలతటాకము శమంతపంచకం
బున వెలయించి క్షత్రియులపాం గడగించినకాలమూర్తియౌ
రణతలరుద్రుఁ డీపరశురామునిశౌర్య మెఱింగి నిద్రలో
ననె వధియింపఁగా దలఁచినాఁడవుగా గురుజీవనాశనా.

క—హరిహరీ! ఈయభాగ్యునకు బ్రాహ్మణ వధాఘం
బొక్కటి తక్కువయా?

పర—కాకున్న నింతశోణితము నాశరీరముఁ శంకపఱుప నేల?

ఆ. ఇరువదొక్కమారు లిలపతులను గూల్చి
విసువు గాంచి యీపవిత్రమతముఁ
గోరియున్న నాశరీరంబు నిట్లు గ
శంకపఱచినావె శంక లేక,

క—నిద్రాభంగ మగునని మిమ్ము లేపక మిన్నకున్న నాతప్పు
సైరింపవలయును.

పర—ఛీ! అసత్యవాదీ! క్షాత్రరక్తప్రవాహములం దడసిన
నా చేతులను మరల నీదారుణకార్యమునం బ్రవేశ పెట్టఁజూచుచుంటివా?

కర్ణ—నాతప్పు గావలయును.

పర—ఇందు నీతప్పేమి? ఈరక్త మెట్లు గలిగినది?

కర్ణ—దేవరవారు తలగడగా శయనించిన నాయంక భాగము
నొకపురుగు తొలిచినది.

పర—నాకేల తెలుపవైతివి?

కర్ణ—నిద్రాభంగమగునని భీతిల్లితినని విన్నవించియుంటిని
గదా!

పర—(గాయమును చూచి నిలువున తలపంకించి) ఈరక్తంపు
మడుగు లేర్పడునంతవఱకీబాధను నీవే సహించితివా?

కర్ణ—అన్నియు నెఱింగిన మీ కేమి చెప్పఁగలను?



పర—ఏమీ! బ్రాహ్మణునకా! ఇంతసహనమా! ఓరీ కపట
బ్రాహ్మణవేషధారీ! నన్నింత మోసగించితివిరా! పాపీ!

గీ. ప్రళయదావానలము చల్లఁబడఁగవచ్చు
దుర్విషంబైన మధురమై తోఁపవచ్చు
వరసుధారస మర్కుండు గురియవచ్చు
విప్రునిసహిష్ణుతనుఁ గన వినఁగ లేదు.

ఛీ! నీ వా బ్రాహ్మణుఁడవు?

కర్ణ—(పాదములంబడి) స్వామీ! మహాపరాధము చేసితిని!
ఆగ్రహించిన ననుగ్రహించిన నీవే! నన్ను రక్షింపుము. విద్యాసక్తిచే
నిట్లు కపటరూపంబు దాల్పవలసివచ్చినది.

పర—(ఆలోచించి) ఆహా! నీసత్యచరిత్ర మిపుడు గదా
తెలిసె! సూతకులాధమా! నీశరీరస్పర్శచేత నే కాక విశేషించి నీమలి
నరక్తస్పర్శచే కళంకమైన నాశరీర మే ప్రాయశ్చిత్తముచే పవిత్రము
కాఁగలదు?

కర్ణ—సర్వజీవులను పవిత్రులనుగాఁ జేయఁజాలిన మీ కప
విత్రతయును లేదు. అందులకు ప్రాయశ్చిత్తము నొక్కఱలేదు.

పర—ఓరీ యనృతాలాపీ! నిత్యమహాకలుషవర్తీ! ఇట్టిగురు
ద్రోహివగు నిన్ను సంహరించినను పాపములేదు. కాని—

మ. బుధలోకోన్నతరాజకంఠశతసంభూతారుణంబైన త
ద్రుధిరాస్వాదనమత్తచిత్తయగు మద్రుద్రాయుధేంద్రంబుచే
నధమంబౌ రథకారశోణితము నాహారింపగాఁ జేసి మ
త్కథనంబుల్ సకళంకమౌవిధమునం గావింపఁగా నేర్తునే.

నాకడ నీవు కపటవేషంబున నేర్చినవిద్య నిష్ఫలంబగునట్లు శపించితి
పొమ్ము.

కర్ణ—హా! హతాశుఁడ. మహానుభావ! దయామతిపై
నీపాలఁబడిన నన్ను రక్షింపుము.

పర—నీదురాచరణముచే నాపాదమస్తకమును భగభగ మండుకొనిపోవుచున్నది. నాయాగ్రహాగ్ని మండి నిన్ను భస్మీభూతునిఁ జేయుదనుక నామ్రోల నుండక శీఘ్రముగ నిచ్చటనుండి తొలఁగి పోయెదవా! రక్షింపఁబడెదవు; కానిచో నీ కిదే వినాశసమయము.

ఆ. నాశమయ్యె మున్ను నాకోపభరమున
క్షత్రియాన్వయము లసంఖ్య గలవి
శూరహితముగాదు; శూద్రవధంబు నా
తలను గట్టకింక తొలఁగి పొమ్ము.

కర్ణ—పవిత్రబ్రాహ్మణకులాధారుఁడవు. అకల్మషుఁడవు; పుణ్యమూర్తివి. శాపచాపంబుల నేకపరాక్రమంబులఁ బోషించినప్రతాపశాలివి. బ్రహ్మజ్ఞానసంపన్నుఁడవు. దయాస్వరూపుఁడవు. నీపాదాంగుష్ఠంబులంబట్టి వేఁడుకొందును. నన్ను శపియింప నేఁ జేసినయపరాధం బేమియును లేదు. నిర్మలమానసంబున యోచించి నన్ను పాలింపకున్న నన్యగతి లేనివాఁడను. విద్యాభిలాష తీవరింప విప్రులకుఁ దక్క తమకడనున్న శరవిద్య దుస్సాధ్యంబని యెఱింగి యీబ్రాహ్మణ వేషంబున మిమ్ముఁగొలిచితి. ఈనాకపటప్రవర్తనంబున నాత్మలాభంబుగోరితి గాని వరనాశంబు గోరినవాఁడను గాను. నన్ను రక్షింపుము. శరణన్నవాని శపించుట మీవంటి యుత్తమబ్రాహ్మణుల కుచితంబుగాదు.

(పాదములఁ బడును).

పర—అబ్రాహ్మణుల కస్త్రవిద్యోపదేశంబు గావింపనని నాతాల్చినప్రతిజ్ఞను నీ వీకపటరూపంబున భంగపఱచితివి. కావున నీకు శాపమే తగినది! అయినను నీప్రార్థనంబునకు ఫలితంబుగ నాకడ నీవు నేర్చినశరవిద్యయంతయు ముందుసంభవింపఁబోవు కురుపాండవ మహాసంగ్రామంబున నొక్కదినంబున నీకరగతంబై యుండును. పొమ్ము. ఇంక నన్ను విశేషంబుగ పీడింపకుము. కాదు. నేనే నీసమీపమునుండి తొలఁగెదను. (నిష్క్రమించును.)



కర్ణ—(తన) కీడులో మేలయ్యె. కటకటా!

గీ. ప్రథమకబళాన మక్షికాపాత మన్న
రీతి తొలియత్న మిటు నన్ను గోఁతఁ ద్రోసె;
కర్ణజీవితనవనాటకమున కిటుల
నాంది యయ్యె నింకేగతి ముందు గలదొ?

(నిష్క్ర)

౨—దృశ్యము.—హస్తినాపురవీధి.

[శంకిని యను బ్రాహ్మణస్త్రీ ప్రవేశించును.]

శం—"అత్త లేనికోడ లుత్తమురాలు; కోడలులేనత్త గుణవంతురాలు." అనుసామెత మాయింట నిజమైనది. నాపేరు శంకిని యైన మాయత్త పేరు లంకిని. మాగుణములను చిన్ననాఁడే కనిపెట్టినట్లు మాపెద్ద లింతచక్కనిపేరులు బెట్టిరి. ప్రాతఃసమయము మొదలస్తమయమువఱకు నన్ను సాధించుటే యుద్యోగముగాఁగలమాయత్త ముండదాక లొక్కమాఱుగ దగ్గరబడకున్నవిగదా!"అత్త యొకరింటకోడలే"యనుట మఱచినదికాఁబోలును!"వృద్ధనారీ పతివ్రత"యనునట్లు తల తెల్లఁబడిన తలఁపులు చల్లఁబడినవా? నేనునూరాకులు చదివితినో యీగయ్యాళిగంప నూటపది చదివినది. కానీ—కానీ—ఇప్పటికి గడచి గట్టునఁబడినదా? "కోడలా కోకనలిగిన దేమనిన అత్తా నీవీఁపున బూడిదయే" మని యడుగనా? పిసినిగొట్టుమామ పిల్లికిపిడుచ వేయనప్పుడు భర్త సంపాదన బండిచక్రమైనప్పుడు ఏపాట్లు బడకున్న నెట్లు గడచును? ఏది యెటులైనఁగానీ నాయత్త ఉండనీ మండనీ ఈదినమున నాకీగిన్నె నిచ్చి మంచినేయి తెమ్మని వీధికిఁ బంపుటచే నాకు పండువగానున్నది. అందందుదిఱుగు నందగాండ్రు వందలకొలఁది నాకనువిందు చేయుచున్నారు. పదివీధులు తిరిగి తీరికయయినపు డింటికిఁబోవుదును. (నిష్క్ర)

(శరచాపములతో కర్ణుఁడు ప్ర)

క—(తన) పరశురామదత్త మగుదివ్యాస్త్రవిద్య శత్రుసంహారమునకు గాకున్నను మిత్రసమ్మోదమున కీవిధముగా ననుకూలమయినను నామదికి శాంతము గలుగకున్నది.

గీ. పరశురామదత్తబహుశాస్త్రవిదుఁ డని
పార్థు గెలుచు మేటిబంటటంచు
రాజవరులయెదుట రారాజు పలుమారు
పొగడ నామనంబు బొగులు మిగుల.

శాపవృత్తాంతంబు రారాజున కొక్కనా డెఱింగింతునా ఊఁ! తొందరయేల ? ఇటులే యభ్యాసము మానకుంటినా ఒకవేళ శాపము వృథయైపోవఁగూడదా ? కావున తొందరపడి యీమాట రారాజున కెఱిఁగింపను. అభ్యాసమును మానను. ఇప్పటివఱకేదియు మఱి పునకురాలేదుగదా? చూతము (శరము వదలుచు నిష్క్ర)

శంకి—(కర్ణునివంకకే చూచుచు నేతిగిన్నెతో ప్రవేశించి రాయితగిలి క్రిందగిన్నెతో పడుచున్నది).

అయ్యయ్యో ! పాడురాయి కాలికిఁదగిలినందునగిన్నెడు నేయి యొలికిపోయినది. అందగాఁడగుకర్ణుఁడు కంటఁబడినంతనే నా కేమికనుబడుచున్నదో ఎచ్చటనడచుచుంటినో తెలియరానికామవికారము తలకెక్కెను. అయ్యో ! ఈతఁడు శూద్రుఁడు, నేను బ్రాహ్మణిని. ఈవిచిత్రదాంపత్యమేమి ? ఊఁ ! గొంగళిలో నన్నముతినుచు మెతుకులలో వెండ్రుకలేరనేల ? శూద్రుఁడో బ్రాహ్మణుఁడో నాకంటి కందముగనున్నవాఁడే నామగఁడు. ఆహాహా! ఎంత యందమైనవాఁడమ్మా! సహజకవచకుండలములతో నెట్లు వెలుగుచున్నాఁడు. (మొగమునకు చేయియడ్డముపెట్టుకొని చూచుచు) అయ్యయ్యో పాడుకొంప లష్టువచ్చినవి. ఆమలుపు తిరిగినకనఁబడునేమో (గిన్నెచూచి) అయ్యో



ఇంతకు నేతి మాటయేమి ? గయ్యాళిగంపయగు నాయత్త లంకినితో నేమని చెప్పి దాటుకొందును. ఇందులకే పెద్దలు "రంకాడ నేర్చినది బొంకాడ నేర్వవలయు" నని వేదవాక్యముగఁ జెప్పిరి.

లంకి—(ప్ర) సందుమళ్ళినదో సాయంకాలమున కేకదాయిల్లు చేరుట ! దీనిపుట్టినిల్లు బూడిదలో కలసిపోను. దీని పుట్టెలోఁబుట్టిన బుద్ధి పుల్లలతోఁగాని పోవునట్లులేదు. పదిమంది చూచుచున్నారనియైన నదరులేదు. బెదరులేదు. నే నేమైన ననుటకైన—నాబుద్ధిమాత్రము బుగ్గియయి చచ్చినదా ? దాని ననఁబోవఁగా—మనస్సే చెడిపోవుచుండును. పెద్దముండను గనుక యొకరికి దొరుకకుండ రోజులు వెళ్ళబుచ్చుకొనుచున్నాను. ప్రొద్దున నేతికి పంపితిని. రెండుజాములు దాటవచ్చినది. వండిపెట్టినపిండాకూడు చల్లారిపోయినది. దీనిశ్రాద్ధమింకను చెట్టుక్రింద పెట్టుకొనలేదు. ఓసీ ! శంకినీ ! శంకినీ !

శంకి—(స్వగ) శంకినీ శంకినీ యని పిలుచుచు మాలంకిని రానేవచ్చినది. (ఎదురుగ వచ్చి) అత్తా! రెండుజాములు దాటి యెండలో నెక్కడకుఁ బోవుచున్నారమ్మా ?

లంకి—ఓసీ ! తిరుగుబోతా ! ఇంతసేపేమిచేయుచుంటివే ? నీ కేయందగాఁడైన దారిలో గనఁబడలేదుగదా !

శంకి—అత్తా ! అత్తా ! పాడుగొల్లముండ—

లంకి—గొల్లముండ గోదావరిలో కలువనీ ! నీకీయాలస్యమేమి ? అంతవిపరీతపుపెత్తనములా ? నేను మాత్రము మొందఱితో మాటలాడిరాలేదు ! రెండుజాములు జేసితినా ?

శంకి—గొల్లముండ.. కాచిన వేడినేయి కొలతునన్నది. చల్లారినదాక నిలువుమంటిని. ఆలస్యమయినది.

లంకి—ఏది ? ఏది ? కంపులేదుగదా ! తిన్నగాఁ జూచితివా ? పూసకట్టినదేనా ? క్రొవ్వుకలిసిన కోమటినేయి కాదుకదా !

శంకి—సరి. సరి. ఈపంచాయతీ వీధిలోననేనా? ఇంటికి పదఁడి. చూపుదును.

లంకి—ఇంటికిపోయినదాక చూడనేకూడదా? చూపనైన జూపు. ఏకంపునేయిఁ దెచ్చితివో? దీనితో పదిరోజులు గడుప వలెను.

శంకి—ఆఁ! ఆఁ! ఎంతమాట. కర్పూరమువంటినేయి.

లంకి—ఏది? ఏది?

శంకి—(గిన్నెబోర్లించిచూపును)

లంకి—మండువేసవిలో రెండుజాముల వేళ, నింతగట్టిగా నెట్లు పేరుకొన్నదే! గేదె నేయి కాఁబోలును!

శంకి—సరే లెండు! ఆవునెయ్యి; ఇంతదూరముపోయి గేదె నేయి తెత్తునా?

లంకి—ఏదీ! గిన్నెలోపల చూడనిమ్ము. అట్లు గిరగిరఁ ద్రిప్పె దొందువేమి? అంత తెల్లఁగా నున్నదేమే?

శంకి—మీది మరీ విపరీత మమ్మా! రాతి వెండిగిన్నెలో తెల్లఁగానుండక పచ్చగానుండునటమ్మా?

లంకి—అయ్యో! గ్రహచారమా? నేయియుండఁగా, గిన్నె లోపల నెట్లు కనఁబడునే!

శంకి—నేయి యింక గిన్నెలో నట్లేయున్నదా మీకోసరము వట్టిగిన్నెయే.

లంకి—ఓసి నీయమ్మ చచ్చిపోను. పొద్దునెత్తిమీదికి వచ్చినది. ఇంకను నేయితేక, వీధులలో నాడుచుంటివా!

శంకి—ఆఁ! ఆఁ! తిట్టకు; నేను మంచిదాననుగాను. నేను వీధివెంట నేయిఁ దెచ్చుచున్న ట్లెందటి సాక్ష్యము కావలెను?

లంకి—అయ్యో! నీనాటకము లూరిలో నెఱుఁగ వా



రెవ్వరు? ఇట్టి నీకు సాక్ష్యముల కేమి కొదువ? నేనే తెచ్చుకొందును. నీపని పాడైనట్లున్నది. ఆపైక మిటుపారవేయి.

శంకి—పైకము నేయియిచ్చిన గొల్లదాని మొగమునఁ బార వేసితిని.

లంకి—మఱి నేయి యెవ్వతె మొగమునఁ బారఁబోసితివి.

శంకి—భూదేవి మొగమున.

లంకి—జారిపడితివా? అట్లేస్వరాదా! నీవే కన్నులు నెత్తి పైఁ బెట్టుకొనివచ్చిపడితివా? ఎవరైన నడ్డమువచ్చి నీవు పడుటకుఁ గారణమయినారా!

శంకి—ఒక మహాపురుషుఁ డడ్డువచ్చినాఁడు. చెప్పుమందువా?

లంకి—ఎవఁడే నీరంకుమగఁడు?

శంకి—నీవేమన్నను నాకు సంతోషమే! కర్ణుఁడు వచ్చినాఁడు.

లంకి—(కోపముతో) ఓరీ! సూతకులకళంక! కర్ణ! నీయావనమదంబు మావంటిబీదయిల్లాండ్రయెడలనే చూపవలసివచ్చెనా? ఇంతయాగడమా! ఇంతయరాజకమా! ఈహస్తినాపురమున, నీ మిడిసిపాటణంచుపాటిధర్మవేత్తలు లేరనితలఁచితివా! ఇది శ్మశానమనుకొంటివా? ఇట్లన్యాయకార్యములకుపాలయినవీ కన్యాయమరణము దాపురింపకుండునా? నీయాగడములు, పూజ్యులగుబ్రాహ్మణస్త్రీలయెడలనా? మానేయి మాకిమ్ము; లేదా భీష్మద్రోణాదులగు పెద్దలతోనైన, ధృతరాష్ట్రాదిభూపులతోనైనఁ జెప్పి తలవాయఁ బెట్టింతుము.

శంకి—అత్తా! వినువిను; రాజభటు లేమో యనుచున్నారు.

(తెరలో)

ఓవృద్ధబ్రాహ్మణి! నోరు సంబాళించుకొనుము. నీమాఁట విని, కర్ణుఁ డిటులే వచ్చుచున్నాఁడు.

లంకి—రానిమ్ము. నిలువఁబెట్టి యాతనిమొగముననే యడిగెదను.

(కర్ణుఁడు శరచాపయుక్తుఁడై ప్ర.)

కర్ణు—కటకటా! ఉరిసినపుండుపై కారము చల్లినట్లు మరల నిదియేమి?

మ. పరహింసాగుణలేశదూరమగు, మద్భావంబుఁ జింతింపకే,
తరుణీరత్నమొకర్తుసాహసము నాత్మం దాల్చి దూషించెఁ గా
యరరే! గంధగజేంద్రమెత్తువడ, తిర్యగ్జంతువేదో యఘ
శ్చరణం జేసెనటన్నరీతిగద, మచ్ఛాపాహతిం గాంచఁగన్.

ఆవృద్ధబ్రాహ్మణియందు నేనేమిదోషముగావించితినో కనుఁగొందును.

లంకి—ఓరిదుర్మతీ! ఇంకను నడుగులో నడుగువైచుకొని నడచివచ్చెదవేమి? పాపముచేసినందుననే నీకు మొగముచెల్లుటలేదు.

క—(తన) ఓహో! ఎంతయమానుషసంభాషణము. (ప్ర) అమ్మా! నాయపరాధమేమి?

లంకి—ఇంకను మోసగించి నన్ను కుపితురాలినిగాఁ జేయఁజూడకుము. నీవుచేసినదాని నింతలోననే మఱచితివా?

కర్ణు—శాపబలంబున నంతయు మఱపునకే వచ్చుచున్నది.

లంకి—శాపబలమా! బ్రాహ్మణులయెడఁ జేసినపాపఫలమా?

కర్ణు—హరహరా! అంతపాప మెవ్వరుచేసిరి?

లంకి—ఎవరోయైన నీప్రస్తావనమెత్తనేల? నీవే

కర్ణు—నేనేమిపాపము చేసితిని? దానికి పరిహారమేమి?

లంకి—కట్టుకొనిపోదగునంతరాజ్యమున్నదే! ఎవరు సంతోషింపవలెనని నీసాములుచట్టుబండలు గారడివానివలె నడిపించెదవు?

[క]ర్ణు—ఆఁ ఏమి! నాశరకాండములవలన నెవ్వరికైన బాధగలిగెనా యేమి! అమ్మా! ఇది ప్రకృతివిరుద్ధముసుమా!



ఆ. శరము గుఱినిఁదప్ప శపియించె నొక్కఁడు
ద్విజుఁడఁ గానటంచుఁ దిట్టె నొకఁడు
శాపకుంచితములు శస్త్రంబు లివిగో! మీ
కెటుల హానిగూర్చె నీశరములు?

లంకి—ఎంతశాపతప్తములైన నాఁకువారిని బాధింపఁజాలవని తలంచితివా?

క—పూవులవలె మెత్తనైననాబాణము లెట్లు బాధించును?

శంకి—(తన) ఆపూవుబాణములే నన్ను బాధించినవి!

లంకి—నాకు వేఱుమాటలేల? నానేయి నాకిమ్ము! పోయెదను. నీబాణములు నీయందే యుండనిమ్ము.

క—నేయియేమి?

లంకి—ఈయుత్తమురాలగునాకోడలిని బలాత్కరించి చేతిలోనినేతి వ్రాలుకఁబోసి నేయియేమనుట నీకేమిన్యాయము?

క—(చెవులు మూసికొని) హరహరా! విప్రవధూబలాత్కారపాపం బొకటి నాతలపైఁ బడినదా! ఓయమ్మ! నే నట్టివాఁడను గాను.

ఆ. ఇంటనున్నభార్య నేలుకోలేక నా
యతివ నితరు లేల నప్పగించి
పరులసతులకొఱకు పరితాపపడుచుండు
వెంగళప్ప లవని వేనవేలు.

లంకి—ఏమే శంకినీ ఈతఁడు నిన్ను బలాత్కరించినమాట నిజముకాకున్న నేయి యెటులొలికినదే?

శంకి—శరవిద్య నభ్యసించుచున్నయీతనిజూచుచు నడుచున్న నేనే క్రిందఁబడితిని.

క—ఔరా ! ఇంతమాత్రమునకా నాకీభూసురశాపవాక్కు?

లంకి—నీ కింతమాత్రముగ నున్న దేమి ?

క—పోయినది గిన్నెడు నేయికదా ? మూల్యమిమ్మన్న నీయకుందునా ?

లంకి—ఇంత యెండవేళ నాకు మూల్యమిచ్చెదవా ? నీమూల్యము మృతనష్టమైపోవును. ఎవ్వరీయెండలో మరలయాదవవాటికకుఁ జచ్చువారు ?

క—అమ్మా ! కోపమువలదు. నేయియే యిచ్చెదను. రండు. నేయియొలికినప్రదేశ మెక్కడ ?

శంకి—ఇదిగో నిక్కడ ! (తనలో) ఒలికిననేతికి బదులుగ నొక్కకౌఁగిలి యీయరాదా ?

క—(నేలపిడిచి నేయితీసియిచ్చుచున్నాఁడు) ఓయమ్మలారా! సంతృప్తులైతిరా ? ఇఁక మీ సెలవుల కరుఁగుడు.

లం—ఓసీ శంకినీ ! నీమూలమున నెంతకష్టము వచ్చినదో చూఁడు ! బలవంతుఁడైనందున మననేయి మనకువచ్చెను. లేకున్న దండుగయేకదా ! నీకెప్పుడింక బుద్ధివచ్చునే ?

శంకి—ఇఁక మనకు బుద్ధివచ్చుటెక్కడ ? పుల్లలుసిద్ధమైనవుడే పద పద. (ఇద్దఱు నిష్క్రమింతురు.)

క—కాలము విపరీతంబైనపు డిట్టివేకదా ప్రాప్తములగుచుండును. తమంతట పైఁబడుచున్నయీశాపవాక్యములు నాజన్మదోషజనితములుగాఁ దోఁచుచున్నవి. కాకున్న నిటులుండునా ?

ఆ. అల్లభార్గవునకు నపరాధ మింతైనఁ
దలపకున్నఁ గల్లె దారుణంబు
విప్రసతులమాట వినినైన నెఱుఁగ, నిం
కెట్టిఘోరములునుఁ బుట్టఁగలవొ !



(తెరలో)

ఓరోరీ దుర్మదాంధకారపరిమత్తహృదయ ! సూతకులాధమ ! రాధేయ ! నిర్నిమిత్తముగ, నిరపరాధనగు నన్ను పిండిపీడించి చేరెడునేయి కొఱకు సర్వక్షమాదేవినగు నన్నునయితము బాధించి, యాగ్రహపూరితఁగాఁ జేసితివిగదా ! సంగ్రామకాలంబున, నీరథచక్రము పలుమాఱు నాతోఁ గ్రుంగుఁగాక !

కర్ణ—(విని) కటకటా ! తా నొకటిదలఁప దైవ మొక్కటిఁ దలఁచె. సర్వంభరయగుభూమిదేవియు నాచేష్టను సైరించి భరింపఁజాలకపోయెనుగా ! కానిమ్ము. సర్వశాపంబులకు నోడియొగ్గితి ! పాండవులే విజయులగుదురని తోఁచుచున్నది ! ...............ఊఁ ! కానిమ్ము. ఆచంద్రతారార్కస్థాయియై. నాదానగుణంబుమాత్రము నాయందునిలచుగాక ! శాపంబులచే నాశౌర్యము సమసిన సమయుఁగాక ! దానవీరకర్ణవిఖ్యాతిచే. నే మృతజీవితుఁడ నగుదుఁగాక !

(నిష్క్రమించును.)

౨. దృశ్యము—. వేదవ్యాసుని ఆశ్రమము.

(వేదవ్యాసుఁడు జపముచేసికొనుచుండఁగా దివ్యదృష్టిలో లాక్షాగృహదహనము కనఁబడుచున్నది.)

వ్యాసు—(ఆగ్రహముతో లేచి) ఆహా ! ఏమి యీయాగడము ! ఏమి యీప్రళయకాలము ? ఏమి యీవినాశసమయము ! దుష్టులగుకురుకుమారులు, శకునిమాయాభిప్రాయప్రేరితులై ధర్మాత్ములగుపాండుకుమారవర్గంబు నెల్ల వారణావతముం జేర్చి యొందుకపటంబున నొక్కలక్కయిల్లు నిర్మించి కుంతీసహితులగుపంచపాండవుల నందు దారుణాగ్నికీలామాలికలలోన భస్మీపటలము గావించిరిగా ! సింహపరాక్రముండగుభీమసేనుండు, దుర్దమప్రబలభుజాదండంబున మాతాసహోదరపంచకము నావలకుఁ గొనిపోవకుండిన నెంతమోసము వాటి

ల్లియుండును? ఎంతనాశనమై యుండును? ఎంతదుష్కర్మపరిపాక మెసంగియుండును? కృతత్రేతాయుగంబులు తమంతటచల్లగా జరిగినవి. ద్వాపరంబున కంతంబగునీసమయంబున నిట్టి మహోత్పాతంబులు రాఁబోవు కలియుగధర్మంబును సూచించుచున్నవి! ఓ ధర్మదేవతా! తల్లీ! రాత్రించరులు జనించినీ కాళ్లువిఱుగఁగొట్టుచుండిరా? ఆహా! పాపులగుకౌరవులమూలమున, నిర్దోషులగుపాండవుల కెట్టియిడుమ లుద్భవిల్లుచున్నవి! (ఆలోచించి) ఇంకను, వీరియాగడంబులను, దివ్యనేత్రంబుల దిలకించెదఁ గాక!

[తిరిగి జపముచేసికొనుచుండగా ద్రౌపదీ వస్త్రాపహరణము కనబడును.]

రే! దురాత్ములారా! ద్రౌపదీకేశాంబరాకర్షణమహాపాతకులారా! పాండవవధూకచాకర్షణకలుషాత్ములారా! మీవినాశకాలములు సమీపించినవి లెండు! మీసతులవైధవ్యంబులకు వ్యవధిలేదు లెండు! ఓరోరి నిర్భాగ్యసోదరశతకంబులారా! విలయసాగరంబు ఘూర్ణిల్లి జనపదనానావనంబులతోడ, బ్రహ్మాండభాండంబుల ముంచి, లలించి యంతమందించు తెఱంగున, మహాశాంతస్వరూపుఁడగు ధర్మరాజుక్రోధంబు కలఁగి యుప్పెనయై మిమ్ము ముంపకమున్నె మెలఁకువఁ దెచ్చుకొనుఁడు. సంగ్రామప్రసిద్ధభీమస్వరూపమై యమగదాదండసాదృశభీమగదాదండము మీనూర్వురిశిరములు ఫక్కఫక్కున బ్రద్దలు సేయకమున్నె మీదురాగతములను మానుఁడు. అర్జునమహాపన్నగము నాలుకలుగోరుచు విషాగ్నులను బుస్సుబుస్సున మీపై విడువకమున్నె సజ్జనవృత్తి నవలంబింపుఁడు! వసంతకాలమధ్యమున గలగలలాడు మహారణ్యములందలికారుచిచ్చులవలె చెలరేఁగి, నకుల సహదేవదావానలకీలలు మిమ్ముఁగాల్చి బూది సేయకమున్నె, రాజ్యసమతము వదలుఁడు. ఆహా నిరాటంకముగ, నిర్భయముగ, నిస్సంశయముగ, మానినీయనక, ఏకవస్త్రయనక చీరలొలువ, నాపాంచాలి-



బొటబొటఁ గన్నీరువిడున, నొక్కొకబాష్పబిందు వొక్కొకపెనుభూతమై మిమ్ములను జన్మజన్మాంతరములు వదలకుండ, పీడింప నారంభింపకమున్నె గతమునకై ద్విశతకపోలంబులను దాడనముఁ గావించుకొనుఁడు! (స్మృతిగల్గి) హా! ఏమిది? కోపావేశంబున మాటాడుచుంటిని! ఇందెవ్వఱును లేరే! ఈదారుణచర్యల నింకనుఁ బరికించెద.

(జపముచేసికొనుచుండ పాండవవనవాసము శమీవృక్షము కనఁబడును.)

హా! ఇఁకేమిసేయుదును? ఎవరినందును? ఎవరిని దూషింతును! ద్యూతప్రియుండగు ధర్మరాజును మాయాదురోదరంబున శకునిచే నోడింపఁజేసి. దురాత్ముఁడగుదుర్యోధనుఁడు వారలకు పండ్రెండేండ్లవనవాసము నొక్కయేఁ డజ్ఞాతవాసంబును నిర్మించెఁగా? కలుషకర్ముఁడు........ఇఁక ధర్మరాజు ధర్మబుద్ధియేల? భీమపరాక్రమవినియోగమేమి? అర్జునవీర్యవిజృంభణఫలమేమి? నకులసహదేవసత్త్వంబులేల? ఇఁక ధర్మ మెక్కడ? అధర్మ మెక్కడ? పుణ్యమేది? పాపమేది? ప్రళయకాలంబునఁ జతుర్దశభువనంబు లేకమైన తెఱంగున సర్వప్రపంచమును మాయాసంఛన్నంబయ్యె! దైవము లేఁడే? పాపపుణ్యంబుల విభజించి, ధర్మస్థాపన మొనరింపఁడే? కలి మాయలఁ బటాపంచలుగావింపఁడే? లోకములం బాలింపఁడే? భూభారనివారణార్థము కృష్ణరూపంబున నవతరించిన నారాయణుం డేల కన్నులుమూసెను. ధర్మమూర్తులగు పాండవులను రక్షించి కురుకులంబును శిక్షింపకున్న నింక తా నెందుకు?........ఆహా! కన్నుల నీమరంతములు, వీక్షింపఁజాల! వీక్షించి సహింపఁజాల? కురుకులంబు నెల్ల నాశాపాగ్నిచే భస్మీభూతము గావించెద. ఆవలపాపము రానిమ్ము పుణ్యము రానిమ్ము.

[కృష్ణుఁడు ప్రవేశించును.]

కృ—వ్యాసభగవానుఁడా! శాంతింపుము- శాంతింపుము! ఏటి కీయాగ్రహము! ఏటి కీకోలాహలము!

వ్యా—శ్రీకృష్ణా! ఏమి యిది? పాండవకులంబునకు గల్గిన దురంతముల నీక్షింపవే? ఇట్లు నిశ్చింతతో నుండఁదగునా? ఆగ్రహ మేటిక నెవనేల? ఇంతకన్న నాగ్రహసమయ మేది?

కృ—వ్యాసమునీంద్రా! ఆగ్రహమన్న నేమనుకొంటిరి? మీరందునది యిదియే, సత్యాగ్రహమనియా మీయభిప్రాయము? పాండుధరాకళత్రునినందనులు, ధర్మపాశబద్ధులై దుఃఖంబు నాత్మను దిగమ్రింగి కష్టములను సహించుచుండిరి. ఇదియే సత్యాగ్రహము! మీరును పరమపూజ్యమగు సత్యాగ్రహముం దాల్చి వేచియుండవలయును. పాండవులు దివ్యసత్యాగ్రహ విశేషమున తమరాజ్యమునందఁగలరు. వారి యాత్మశక్తిబలంబుననే, కురువంశంబు నిర్మూలమగును. మన ప్రయత్నములు కాలప్రవాహము నెదుర్కొనఁజాలవు! ఏటి కీనిరర్థకాగ్రహమును వహించెదరు!

వ్యా—మహాత్మా! శ్రీకృష్ణదేవ! ధన్యాత్ముఁడనైతిని. సత్యాగ్రహధర్మంబు చక్కఁగా నుపదేశించితిరి. క్రోధముం దాల్చి వెకలినైతిని. క్షమింపుఁడు. (ఇరువురు నిష్క్రమింతురు.)

---



# దానవీరకర్ణ.



## తృతీయాంకము.

---

### ౧ వ దృశ్యము:—కుంతిగృహము.

(అంతట కుంతి విచారముతో ప్ర)

కుంతి—(స్వ) కటకటా! మాలదైవమా! అంతటిపాండురాజున కిల్లాలనై లోకంబులను గడగడలాడించు నేర్పుగల పాండవులకుఁ దల్లినై పరులపంచలఁ బడియుండుమని నానుదుట వ్రాసితివా! నాకుమారులందైన నొక్కనియదృష్టమైన శుభప్రదముగ నుండఁగూడదా? అందరిగీత లొక్కతీరుననే కావలయునా? కృష్ణా! దీనబాంధవ! బాంధవులమైనమమ్ము సుంతైనఁ గరుణింపక పాపాత్ములగుకౌరవులకే యభ్యుదయములఁ గూర్పనుంటివా?

(కృష్ణుఁడు ప్రవేశించును.)

కృ—అత్తా! కృష్ణుఁడు నమస్కరించుచున్నాఁడు.

కుం—ఆయుష్మంతుఁడవు గమ్ము బాలకా! దీనవత్సలుండవగు పరమాత్ముఁడవైన కతంబునఁ గదా తలఁచినంతనే ప్రత్యక్షమైతివి? ఇట్టిదయామయుండవగునీకు నీమేనబావలపై నేల కారుణ్యము సరిపోయె?

కృ—అట్లెవ్వరు చెప్పిరి ?

కుం—చెప్పవలయునా యితరులు? అధర్మద్యూతమున శకుని రెండవమారు నాయగ్రసుతుని పదభ్రష్టునిం జేసి పండ్రెండేండ్లు వనవాసము నొకయేఁ డజ్ఞాతవాసము ఘటింపనియమించి ధర్మపాశబద్ధునిం జేసిపంపుట జూచుచు మిన్నకుంటివిగాని నీచకార్యయుధంబున కీకౌరవు లెంతటివారు ? అలుకఁ దాల్చినఁ బ్రళయంబు ఘటింపఁ జేయఁజాలు ధర్మప్రవర్తి యగుయుధిష్ఠిరమూర్తియు భుజాదండమాత్ర విచలీకృతసమస్తభువనుఁ డగువృకోదరుఁడును సముచితధనుశ్శాస్త్ర ప్రవీణుఁడగు పార్థుఁడును శత్రుగజకంఠీరవులగు నకులసహదేవులును నిరర్థకులై కన్నుల నీరునిండ విరోధులానందమున సౌధాగ్రములఁ జూచుచుండఁ దమవెంట పాంచాలి దీనవదనయై దుశ్శాసనుండు నిండుసభలో లాగివిడచినకచభారంబు జీరాడ నడువ నడవులకరుగరే వాసుదేవ! ఈకార్యంబులెల్ల నీయుపేక్షవలన జరిగె ! కాని మనసారఁ దలంచిన నీవలనఁ గలుగనికార్యంబులు గలవె.

[విదురుఁడు ప్రవేశించును ]

విదు—చాలును, పాండుమహీశ్వరపట్టమహిషీ ! చాలును నీదుర్వాదము ! పాండవైకజీవనుఁడగు కృష్ణపరమాత్ము నెట్టికపటిగాఁ దలంచితివి ? ఈనిరర్థకనిందాపరిభాషణంబుల కీయదుసింహము తగదు. తగనివిధంబున నీమాధవుఁ బరితోషించుచుంటి వేమి ? సదా దయాస్వభావుఁడగునీగోపాలబాలుని తోడునీడ లేనినాడు పాండవపంచకంబు, క్షణక్షణ ప్రాణసంశయసహితమని నమ్ముము. లాక్షాగృహమునఁ జిక్కువడిననీవు నీకుమారపంచకంబుతోడ, పరిరక్షితవగుట యీమహాత్ముని కృపారసంబుననే! పాంచాలీవస్త్రాపహరణంబునలువు నెడల కురుకులంబెల్ల విస్మయభీతచేతస్కమై దిక్కులఁ బార, నక్షయచేలంబులు ప్రసాదించినదియు నీదేవదేవుఁడే ! ఎట్టి ఘనవిపత్పరంపరలు చుట్టుముట్టిన, నెట్లు రక్షింపవలయునో తగుసమయ మెఱింగి పాండవులఁ



గంటికి ఱెప్పవలెనరయు నీదయాసముద్రుఁడు నిన్ను దయఁదలంపఁడే?

కుంతి—జ్ఞానవిధురా ! విదురా ! నీవచించినచందము నెఱుంగని మందురాలనుగాను. అయినను స్వతంత్రుఁడగు మేనల్లుఁడుగావున నించుక నిష్ఠురమాడితి. ఇది యాతనియెడల నపచారంబగునే ? ధర్మపక్షముఁ బూని సత్స్వభావుఁ డగుయశోదాకుమారుఁడే ధర్మము మాననంతదనుక నాకుమారులఁ గావఁ గామధేనువని తెలియనిదాననా ?

కృ—అత్తా ! నీమేనల్లుఁడు తనబావమఱందులపై నపేక్ష గలవాఁడుగాని యుపేక్షగలవాఁడు కాఁడు. పూర్వకర్మఫలం బెంతటివారికైన ననుభవింపక తప్పునది కాదు. పాండవులుసయితము తమ కర్మఫలానంతరమున సమస్తసుఖభోగంబుల ననుభవించి యీధరాతలంబున ననంతసామ్రాజ్యముం బరిపాలింపఁగలరు. కావున నీవు చింతఁదక్కియుండుము,

కుంతి—గోపాలకంఠీరవా ! ఆగతానాగతవేదివగు నీపల్కులన్యథాయగు టరుదు. ఐనను నేను పాండవవిజయంబునసంశయించుటకుఁ బ్రబలకారణ మొండు వేఱుగాఁగలదు.

కృ—అది యేమి ?

కుంతి—కర్ణునిఁ దలంచి భీతిల్లెద.

కృ—ఔను. అది భయస్థానమే !

కుంతి—అటులైన నాకుమారులు పరాజయముఁ గాంతురా?

కృ—ఈకృష్ణుఁడు లేనప్పుడు.

కుం—ఉపాయాంతరము ?

కృ—తత్కార్యనిర్వాహణంబు నాయందుంపుము. కర్ణుని ప్రబలశాపాహతునిఁ జేసి నిర్వీర్యుం జేయుభారము నాది.

కుం—కృష్ణా ! నీవు సర్వవిషయవేదివి ! కర్ణుని మడియింతువేని నాకు తీరనిపుత్రశోకము గలుగును. కావున నుభయపక్షోపకారిష్ఠవి

చ్ఛేదకంబుగ సంధి పొసఁగునేని యట్లు గావించి కురుపాండవుల నుద్ధరింపఁజూడుము.

కృ—పాండవమాతా ! కర్ణార్జునులు మిత్రులై భారతసంగ్రామము కడముట్టుట స్వప్నవృత్తాంతమని తోఁచుచున్నది.

కుం—కపటప్రపంచనాటకసూత్రధారి వగునీవు దలంచునెడలఁ గారాని దేమున్నది.

కృ—అమ్మా ! నీవు చింతింపకుము. సాధ్యమైనంతవఱకు నేను సంధిచేయ యత్నించెద. అది సాధ్యముకాదేని కర్ణునైనఁ బాండవపక్షమునకు మరలింపఁ జూచెద. అదియుఁ గాకున్న పాండవవిజయంబే ధ్రువఁబుఁ జేసెద. ఇఁక నీ వఱుగుము.

కుం—(నిష్క్రమించును).

విదు—జగన్నాయకా ! "కర్ణునిఁ దలంచి భీతిల్లెద" నని కుంతీదేవియనుటయు నీవు "ఔను ! అది భయస్థానమే" యని పలికితివి. అనితరసులభమహామహిమాన్వితునకు నీకునైత మానూత సూతి భయస్థాన మయ్యెనే ?

కృ—విదురా ! ఆకర్ణుఁడు సామాన్యుఁడుగాఁడు. అతనిదానగుణంబు జగద్విశ్రాంతమయ్యెను. గోబ్రాహ్మణప్రీతిఁ గావించినందువలన దేవత లాతనియందు సంప్రీతులైరి. అట్టివానిని జయించుట దుస్సాధ్యంబని నామదికిఁ దోఁచెను.

విదు—గోపాలకృష్ణా ! ఆతఁ డంతటిదానకర్ణుఁ డగుట నిజమా ?

కృ—"నిజమా ! యని సంశయింపనేల ? ఆతనివితరణశీలత నీ కెఱుంగఁజేసెద. సాధువేషంబులఁ దాల్చి మనమాతనికడ కరుగుదము రమ్ము.

విదు—అట్లే చేయుదము. (ఇరువురు నిష్క్రమింతురు.)



౨వ దృశ్యము.

[ప్రవేశము—కర్ణుఁడు. మంత్రిపరివారము.]

(నృత్యము జరిగినతరువాత)

కర్ణ—సచివచంద్రమా ! సప్తాహమునకై వచ్చినసమస్తజనులకును మర్యాదలు యథావిధిగ జరిగెనా !

మంత్రి—ప్రభువునానతి మఱొకవిధ మెట్లగును ?

కర్ణ—విప్రులకు, సాధులకు, సర్వసత్కారములు జఱిగెనా? దక్షిణలు సంతృప్తిగ నొసంగఁబడినవా ?

మంత్రి—భాగ్యము.

(కృష్ణ, విదురులు, సాధు వేషములతో ప్రవేశించుట.)

కృ—విదురా ! చూడుము. ఆసింహాసనస్థుఁడగు మహాతేజశ్శాలియే కర్ణుఁడు; మన మీచాటుననుండి యాతనిపరిపాలనావిధానముం బరికింతము.

విదు—చిత్తము. (ఒకప్రక్కనుందురు.)

కర్ణ—అడుగ మఱచితి. మొన్న దక్షిణదేశమునుండి యజ్ఞభిక్షకై వచ్చినవిప్రులకోర్కెలు తీర్పఁబడినవా ?

మం—క్షమింపవలయు. వారింకను రాజప్రాసాదమునందే యున్నారు.

క—ఎందుచేత ?

మం—నెలదినములనుండియు నెడతెగనివర్షపాతము. ఆబ్రాహ్మణులు, యజ్ఞముచేయుదురట ఇంధనములు కావలయునట వర్షములు వెనుకఁబట్టుదనుక నుండుమంటిని.

క—ఛీ ! ఏమిపనిచేసితివి ? మనయనుకూలసమయముకొఱకు విప్రకార్యములు నిలువవలయునా ? ఏమి నీబుద్ధిజాడ్యము ? నీలోభగుణంబు వదలవైతివిగదా ! ఈకర్ణుని "దేహీ" యని యర్థించినవాఁడు నీవలన వ్యర్థుఁడుకావలయునా ?

కృ, వి—(విని తమలో సౌజ్ఞలుచేసికొందురు)

మం—ఆజ్ఞ యెటులయిన నట్లు గావింతును.

క—ఆజ్యఘటంబు లేవియు మిగిలియుండలేదా?

మం—జాగ్రత్తపఱచెదను

క—పదివేల యాజ్యఘటంబుల నా బ్రాహ్మణుల కొసంగి పంపుము.

మం—చిత్తము.

క—శీఘ్రముగ ముం దాపని కానిమ్ము; ఇంతవఱకైన యాలస్యము చాలును.

మం—(వ్రాసి సేవకునకిచ్చి పంపును.)

క—నీకిదియే శాసనము. అర్థులవిషయమున నీ వేపనినిగాని స్వతంత్రించి చేయవలదు. ఏమందువా?

చ. క్షితిసురకోటులకు వధము సేయుటకన్న మధుద్రవంబు నా
యతమతిఁ ద్రావుకన్న పలలాశనదోషముకన్న గోవధో
ద్ధితమగుపాపకార్యముఁ జేలుటకన్న నసత్యదోషమే
యతితరమై నృపోత్తమ, కులాంతకకారణమై చెలంగెడున్.

సేవ—(ప్రవేశించి) మహాప్రభూ! కొందఱుపౌరులు దర్శనమపేక్షించి హజారమున వేచియున్నారు.

క—సత్వరము రానిమ్ము.

[కొందఱుపౌరులు ప్రవేశింతురు.]

1పౌరు—మహాప్రభూ! దిక్కులేనివారము; కాపాడవలయును

క—పౌరులారా! మీ కేమియాపద గలిగె?

1పౌరు—బాబూ! ఏమిచెప్పెదుము! అతివృష్టిచే పొలములపైరులు మునిగిపోయినవి. దురంతక్షామము గల్గునని భయపడుచున్నాము. మాకొకదారిఁ గలిగింపకున్న బ్రదుకము.



క—సరే! రాజకీయముగ మీరు చెల్లించుచుండినశిస్తులను మానెదము. తృప్తినందితిరా?

1పౌరు—మహారాజా! మీరు శిస్తులను మానెదరుగాని మాకు బ్రతుకుమార్గమేది? ఇంటనుండిన కొలఁదిధాన్యమువిత్తనములకింద మునిగిపోయినది.

మం—మీరు సత్యమేవచించుచున్నారుగద?

క—మంత్రీ! ఇది యనాలోచితమగుప్రశ్న. అనృతము కలనైన నెఱుఁగని యమాయకులగు జానపదులని వారిమొగంబులే చెప్పుచుండుటలేదా? ఎవ్వరెవ్వరిపొలంబు లతివృష్టిచే నాశనములయ్యెనో నీవుస్వయముగ విమర్శించి వారందఱకు సంవత్సరగ్రాసంబు లిప్పింపుము.

మం—భాగ్యము.

1 పౌ—మహారాజా! మీచల్లనిపరిపాలనము వేయేండ్లుండునుగాక!

2 పౌ—మహాప్రభూ! నామనవిగలదు.

క—ఏమి?

2 పౌ—నేను నిరుపేదనగుభూస్వామిని. నాతండ్రిచచ్చినదిమొదలు భూములన్నియు ఋణప్రదాతలపాలైపోవ నొకభూఖండమును మిగుల్చుకొని, నాలుగేండ్లనుండి కాలముఁబుచ్చుచుంటిని. ఈసంవత్సర మీబ్రాహ్మణుఁడొకఁడు వచ్చి నాతండ్రి బ్రతికియున్నపుడిది తనకుదానముగ నిచ్చెననియు తాను కాశీయాత్రకరిగి యీవర్షమే వచ్చెననియుఁ దన కదిచెందవలయుననియుఁ జెప్పుచు దానపత్రముం జూపుచున్నాఁడు. నేను బహుకుటుంబీకుఁడను. మహారాజా! కేవల మీభూమిపై నాధారపడినవాఁడను. న్యాయము దయచేయవలయును

క—ఏదాదానశాసనము?

బ్రా—(పత్రము నిచ్చి) మహారాజా! బ్రాహ్మణుఁడను. బీదవాఁడను. న్యాయమూర్తులు—

క—జానపదుఁడా! ఇది నీతండ్రి వ్రాసిన దేకదా?

బ్రా—మహారాజా! అందు సంశయములేదు.

2—పౌ—రాజేంద్రా! ఇది మాకుటుంబముచ్ఛదినములలో నుండినపుడు నాజసభుఁడు దానముగానిచ్చియుండెను. నాఁటనుండియు మాభుక్తమునందే యున్నది. అదిగాక, మాకుటుంబ మిపుడు చితికి పోయినది.

బ్రా—దానకర్ణుఁడవు మహాప్రభూ నాభూమి నాకిప్పింపుము. వీఁడు నాకుఁగాకుండ తప్పించుకొనఁ జూచుచున్నాఁడు.

క—బ్రాహ్మణుఁడా! అల్లరిచేయకుము. అన్యాయ మెవ్వరికినిఁ గలుఁగదు. ఇది కర్ణునిపరిపాలనమని యెఱుఁగుము.

బ్రా—అట్లయిన శాంతించితిని.

క—జానపదుఁడా! ఎట్టికాలమున నెప్పుడు దత్తమైనను దానముదానమే! సత్యవాక్యమున కెన్నటికిని వికల్పము జఱుగజనదు అదిగాక పితృశాసనమును నీవు చెల్లింపవలయును. నీ వీక్షేత్రము నీవిప్రునకు విడువనేవలయు.

బ్రా—మహాప్రభూ! సూర్యచంద్రు లున్నంతకాలము మహేంద్రభోగము లనుభవింతువుగాక!

2 పౌ—అయ్యయ్యో! ఇంక నాబ్రతు కేమున్నది? నా బిడ్డలు చావవలసిన దేనా?

కర్ణ—పౌరుఁడా! శాంతింపుము. ఈపత్రము ననుసరించి యీబ్రాహ్మణునకు నీ వైదుపుట్లభూమి నీయవలసియున్నది. కావున నీకు మేము పదిపుట్లభూమిని మాన్యముగా నిచ్చితిమి! వలయుస్థలమునఁ గొని యథేచ్ఛగా ననుభవింపుము పొమ్ము.



2—పౌ—నాతండ్రీ! నీయింట కనకాభిషేక మగునుగాక! నీకడుపున మామిడిపండ్లవంటిబిడ్డలు పుట్టుదురుగాక!

క—పౌరులారా! ఇఁక మీరరుగుఁడు.

పౌ—చిత్తము. (నిష్క్రమింతురు.)

క—మంత్రీ! కాలాతీతమయ్యె! సభ చాలింతమా?

మం—చిత్తము.

కృ—విదురా! ఈతఁడు సభ చాలించుచున్నటు లున్నది మన కిదే సమయము.

విదు—అటులే కావింతము.

కృ, వి—విజయతాం, విజయతాం, రాజన్

క—భూసురాశీర్వాదమును నమస్కారణపూర్వకముగఁ గైకొంటిని. మహాత్ములారా! ఈపీఠముల నాసీనులుగండు.

కృ, వి—(కూర్చుందురు.)

కృ—రాజా దానకర్ణుఁడవనివిఖ్యాతి విని బహువ్రయప్రయాసల కోర్చి దూరదేశమునుండి వచ్చితిమి. పూజ్యుల మగుసాధువులము. కేలుసాచి దేహీ యని యర్థించుచున్నాము. మాకోరికలు దీర్పవలయును.

క—సాధూత్తములారా! ఇంతవఱకు కర్ణునిచే నిరాశనందిన యర్థులీభూతలమునఁ గలుగరు. తమ కోరిక నెఱిఁగింపుఁడు. ఎట్టిదైనఁ గాదనక తీర్చువాఁడ.

కృ—మహారాజా! మేము బదరికావనమున సత్రయాగముఁ దలపెట్టితిమి. మాసముదినములనుండియు నఖండవృష్టిగనున్నది పొడిసమిధలు లభింపక బ్రాహ్మణకార్యము భంగమగునట్లు కనఁబడుచున్నది. మాకింతకన్న వేరుదానము లక్కఱలేదు. పదిబండ్లపొడిసమిధల నిప్పింపుము.

క—సచివోత్తమ! ఏమిచేయవచ్చును!

మం—యజ్ఞవిషయమే మఱలవచ్చెను. వర్షకాలముగదా!

క—ఆజ్యభాండములు గలవా?

మం—ఇప్పుడేకదా! పదివేలకు వాగ్దానమైనది. మఱల, గావలయునన్న నసాధ్యముగాదా?

కృ—రాజా! ఈయాగమునకు సమిధలేకావలయును. ఆజ్యము నిదివఱకే జాగ్రత్తపఱచితిమి.

క—సాధువులారా! మీడెందంబులఁ గొందలంబందకుఁడు. చందనదారునిర్మితంబగు నీమందిరమును మత్కరప్రయోగకౌశలమునఁ గూలనేసి యిచ్చెద మీరీచందనకాష్ఠంబులనే యజ్ఞార్థము వినియోగింపఁబ్రార్థించుచున్నాను.

(కర్ణుఁడు చందనగృహమును కూలనేయును.)

అందఱు నిశ్చేష్టులగుదురు,

విశ్రాంతిసంకేతమగుయవనిక మెల్లగవ్రాలును.

విశ్రాంతికాలము.

తృతీయాఙ్కమ్-సంపూర్ణము.

---



# దానవీరకర్ణ.

## చతుర్థాంకమ్.

——:o:——

### ౧ వ దృశ్యము—ద్వైతవనము.

[పాండవులు ద్రౌపది ప్రక్కనచారుఁడు]

ధర్మ—చారుఁడా! తరువాత నేమిజరిగినది?

చా—స్వామీ! అట్లుప్రయాణమైనమద్రరాజు తనమేనల్లుండ్రగునకులసహదేవులఁ గనుగొనుకోరికగల్గి కతిపయసేనాసహితుఁడై యీవంకకే వచ్చుచుండెను. ఈయెడకు శల్యుండువచ్చినయెడల మేనల్లురయెడల మోహంబున జఱుగఁగలరణంబున పాండవపక్షమునే వహించుననియు భీమసేనునంతటివిక్రమముగలశల్యుఁడు తమయండ నుండిన సేమమనియుఁ దలపోసి దుర్యోధనుఁడుకపటవేషంబును వహించిశల్యునివెంబడించెను.

భీము—కపటవేషంబు వహించెనుగా? ఓరీ! దుష్టదుర్యోధనా! ఇంకను నీకపటంబు విడువవైతివిగదరా?

మ. విసముంబెట్టితి; నీటఁ ద్రోసితి; మహాభీలాగ్నులం గాల్చి నా
యసువుల్దీయఁ దలంచి తంతటనుఁ దృప్తాత్ముండవుం గాక యీ

బిసజాతానన, ద్రౌపదీసతిని, నిష్కృతిం బరాభూతంగా
నొనరంజేసితి వల్లె శల్యుఁడని నీ వూహించితే దుర్మతీ.

అర్జు—అన్నయ్యా ఇప్పు డీయప్రస్తుతం బేల ?

ద్రౌప—ఇంతేకద ! మీయన్నదమ్ములపరితాపము ?

భీము—పాంచాలీ ! ఇంతేయనియా? ఔను. ఇప్పటికింతే—
(మీసము త్రిప్పుచు)

గీ. ఈత్రయోదశవత్సరమాత్రదీక్ష
వదలఁ గానిమ్ము; నీవ చూచెదవు గాక
కురుకులసరస్సుఁ గలఁచి యీకుంజరంబు
ద్రుంచు కురుల నుత్తామరతూండ్ల నెల్ల.

ధర్మ—తమ్ముఁడా ! ఇప్పు డెవ్వరిపైనాగ్రహము ? శాంతింపఁ గూడదా ? పాంచాలీ ! నీవును తగినటులాడుదానవే ? చారుఁడా ! కపటవేషంబున దుర్యోధనుఁడేమిచేసెను? మామ కేమైన హానిగల్గింప లేదుగద ?

చా—ఉపకారము నపేక్షించినవాఁ డపకార మేల చేయును?

ధర్మ—ఎట్టియుపకార మపేక్షించెను ?

చా—విన్నవించుచున్నాను. శల్యునిసైన్యంబునకే దుర్యోధను డొకసామాన్యభటునివేషంబున విహరించుచు శల్యుఁడు బస చేయుమార్గంబునందెల్ల చలువపందళ్ళు, చలివేంద్రిలు, పంచభక్ష్య సంయుతంబులగుభోజనంబులు, మార్గాయాసాపహారంబులగు వాహనంబులు, ననుకూలంబులగునట్లు గావించుచుండెను.

ధ—ఇది యెంతయుఁ జిత్రము ! తరువాత

చా—తరువాత, నొక్కనాఁడుమద్రరాజు సుఖాసీనుఁడై యుండి, "నా కీసుఖంబులు గూర్చుచున్నమహనీయుఁడు గాన్పించినా నాశిరంబిచ్చెద" నని పలుకఁ దటాలున దుర్యోధనుఁడు భట



వేషంబుఁదీసివేసి, పాదములంబడి, "మామా ! సంగ్రామంబున నీ సహాయము గావలయు" నని పలికెనఁట ! అంతట శల్యుఁడు ప్రీతుఁడై యాతని కావాగ్దానం బొసంగెనఁట !

ధ—(స్వ) ఔరా ! ఎంత మోసగాఁడు సుయోధనుఁడు !

ఆ. భండనోక్తశస్త్రభాండారసామగ్రి
తోడ దారులందుగూడఁ గొట్టి
తగినబంధుజనులఁ దనపక్షమునఁ జేర్చు
కొన్నవాఁడెదా సుయోధనుండు !

ఈతనియుద్యోగంబు మెచ్చఁదగియున్నది. దీని కేదేనిప్రతివిధానం బాలోచింపవలయు (ప్ర.) చారుఁడా ! ఇప్పుడు శల్యుఁడెక్కడ ?

చా—మీకడకే వచ్చుచుండెను. ఇప్పటి కీయాశ్రమంబు చేరెననియే నాతలంపు.

[తెరలో]

యుధిష్ఠిరమహారాజా ! మద్రరాజేంద్రులు వచ్చినారు.

ధర్మ—ఓహో ! రానేవచ్చెను. చారుఁడా ! నీ వింక నరుగుము. పాంచాలరాజపుత్రీ ! నీవును—తమ్ములారా ! ఈతని నెదుర్కొందమురండు.

(ద్రౌప, చారు, వేర్వేర నిష్క్రమింతురు.)

(పాండవులెదురేగి శల్యునిఁదోడ్తెత్తురు. అందఱు నాసీనులగుదురు).

శల్య—కటకటా ! ఎట్టిస్థితిలో మిమ్ముఁ జూడఁగంటిని.

గీ. పాండుభూజాని మాబావ పరమపదముఁ
జేర మాద్రి మాసోదరిచితినిఁ జేరె
నపుడు మాద్రేయులను మిమ్ము నరసినాఁడ
నేఁడు మరల మి మ్మీస్థితిఁ జూడఁగంటి.

దురాత్ములగు దుర్యోధనాదులు మిమ్ముఁబెట్టిన కష్టోదంతంబులనెల్ల

నాలకించితిని. అయినను శ్రీకృష్ణభగవానుఁడు మీయండనుండుదనుక
మీ కేయపజయమునుఁ గలుగదు.

భీ—మామా! అంతటిసానుభూతిగలవాఁడవు మరల సుయో
ధనునకు సహాయమగుదునని వాగ్దత్తముఁ జేసితివఁటగాదా!

ధ—అతఁ డేమిచేయును! ఇది దుర్యోధనునిమోసముగదా!

శ—శమనాత్మజా! మీ కీవార్త యెట్లు తెలసెను!

ధ—భగవదనుగ్రహమున సర్వవార్తలును దెలియుచునే
యుందును.

శ—ధర్మజా! సుయోధనున కట్టివాగ్దానముచేయుట సత్య
మేకాని, యందులకు భంగమురానిసహాయము మీ కేది వలయు
నన్నఁ గావింతును.

ధ—ధన్యాత్ముఁడ నైతిని. మామా! ముందు జఱుగఁబో
వుకురుపాండవరణమందునఁ సూతపుత్రుఁడగు కర్ణునకు నిన్ను సారథిం
గాఁ జేసిమనయర్జునునిపైకంపుదురు. ఆసమయంబున నీవు కర్ణునకు నిరు
త్సాహకరములగువాక్యములనాడుచు, నాతనిమనంబు నెప్పటికప్పుడు
కలఁచివేయుచుండవలయును. ఇదియేనీవునాకుఁ జేయఁదగినయు
పకారము!

శ—నిస్సంశయముగఁ గావింతును!

ధ—నేఁడు కడుసుదినము. మామా! ఎండఁబడివచ్చితివి.
భోజనసమయమైనది లెమ్మా.

(అందఱు నిష్క్రమింతురు).

---



౩ వ దృశ్యము.

(కుంతి ఒంటరిగ ప్రవేశించును)

కుంతి—(స్వ) కటకటా! కన్యాత్వంబుననే దూర్వాసుండు
నాపాలి కేలరావలయు! వచ్చినవాఁడంతతోఁబోక, మత్పూజలకానం
దించి, నాకామంత్రంబేల నుపదేశింపవలయు? ఉపదేశించినంతనే
యూరకుండక గంగాతీరముం జేరి సూర్యునేల నారాధించితిని!....
నా కాకుమారుఁడు వివాహపూర్వంబుననే కానీనుడై కలుగనేల?
కన్నకడుపనికనికరింపక లోకపరివాదంబులకు భయపడి, దేదీప్యమాన
ముగ కవచకుండలములతో వెలుగుకన్నకుమారుని గంగకర్పించితి.
అట్టివాఁడు నాపుత్రుండని వెల్లడిచేతమన్న! లోకంబు నన్నెట్లు
దూషించి తూలనాడునో యని సంశయము. వెల్లడింపకుందమన్న
తెరలు తెరలై వెల్లువలై గర్భగోళమునందంతటను భరింపరాని మహా
దుఃఖమేదియో సముత్పన్నంబై నాప్రాణంబులం దీయుచున్నది! ఎట్టి
దుఃఖంబులనైన భరింపవచ్చును. ఎన్నియాపదలనైన నోర్వవచ్చును
గాని కటకటా!........కడుపునఁగన్నకుమారుఁడు సకలలక్షణ
లక్షితాకారుఁడగు జ్యేష్ఠుఁడు. అట్టివానిని, శత్రుమిత్రభేదంబుమాని
సర్వజనులును, సూతకులాధముఁడని దూషించు, దురంతనిందాగర్భ
వాగశనిపాతంబులబారి నాతనిఁ బడనేసిన నా దెంతటి శిలామయ
మానసమో వ్రీలకున్నదిగదా! మేలు! ...... దుర్యోధనా!
మేలు.........స్నేహధర్మంబును చక్కఁగా నెఱిఁగితివి! నాప్రథమ
పుత్రుడగు కర్ణునాదరించిన నీవు మరణపర్యంతము సకలవైభవంబుల
ననుభవింతువుగాక! ... .....పూజ్యురాలవగు నోరాధా! కోటి
సూర్యప్రభారాసి యగు కుమారునింగని గంగోదకంబున విడిచిన
నాకన్న పెంచిపెద్దవానిం జేసి, ముద్దుముచ్చటలనుభవించిన నీవుగదా
యదృష్టవంతురాలవు! అకటకటా! నేనిపుడేమిచేయను? ఎటుచూ
చినఁగన్నకడుపేగదా! హా! మాలదైవమా! వేరుచేసిన కుమారు

నంతతోఁ బోనీయక, శత్రుపక్షంబునఁ జేర్పవలయునా!.........
అక్కటా! నేనింక పుత్రశోకంబు దిగమ్రింగి యంగీకృతకార్యమును
చేయనేవలయును...... మానసమా! ధైర్యమును వహింపుము.
పుత్రమోహమా? నాదరికిరాకుము. అర్జున ప్రాణరక్షణార్థము కర్ణుని
వదలనేవలయు అయ్యో! ఇప్పుడు వదలుటేమి? ఏనాఁడు, పాపిని
నగు నాకడుపునబుట్టెనో యానాఁడే విడనాడితిని, కర్ణార్జునులిద్దఱును,
నాకుమారులు గారు. కారు. ఎన్నఁడునుగారు. (కన్నులుమూసి)

నాథా! త్రిటపాధినాథా! నీకుమారుఁడగునర్జును, నీ సంగ్రా
మంబునరక్షించుకొమ్మా.

— దండకము —

నాకాధిపాలా! సురానీకలోలా! శచీజీవకారుణ్యలీలావినోదా
సముత్తుంగ శృంగాయుతానంత శైలప్రమోదాపహారీ! సదా నందనో
ద్యానరంగద్విహారీ మదోద్రేకదుర్వారి గర్వాపహారీ! నమో వజ్రపాణీ
నమస్తే నమస్తే.

ఇంద్రు—(ప్రత్యక్షమై) దేవీ! ఈయవసరంబున నావలన
గావలసిన పనులేమిగలవు!

కుం—మహాత్మా! తమపాదపంకేరుహములకు దాసురాలి
యభివాదనము! మహాభారతరణంబు జఱుగబోవుచున్నది.

ఇం—ఐననేమి? చక్రి కరుణావిశేషమున, నందు నీ కుమారు
లకుఁగదా విజయంబుగలుగు.

కుం—అట్టి నిశ్చయమేమియున్నది?

ఇం—పరాత్పరుని సహాయమనిశ్చయమా?

కుం—కాకపోవచ్చును. మనుష్యప్రయత్నమువలదా?



ఇం—ఇప్పుడేమి కావలయు?

కుం—కర్ణుని దలంచిన నామనంబు వ్యాకులం బగుచున్నది.
అతనికడ సహజకవచకుండలము లున్నంతదనుక నొండొరులాతనిఁ దేరి
చూడలేరు.

ఇం—భీతినందకుము. దానమునందు కర్ణునకుఁ బ్రీతియధి
కము. విప్రవేషంబున నిప్పుడే యాతనికవచకుండలము ల నపహరింతును.
నీవువిచారము దక్కియుండుము.

కుం—భాగ్యము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

సూర్య—(రభసమునఁ బ్రవేశించి) రే! దుష్టా! దేవేంద్ర
ఇంతస్వపుత్రపక్షపాతంబుగలనీ దేవత్వమేల కాల్పనా! కర్ణునిదానగు
ణంబు నీకు మెప్పుఘటింపక, నిట్టి దురూహంబులకుఁ బనికివచ్చెఁగా!
కపటకలుషమానసంబున, మృషావిప్రరూపంబున కర్ణుని మోసగింపఁ
దలంచిన, నీదురూహంబులాతనికిఁ దెలుపువారింకు లేరని ప్రమత్తుండ
వైతివిగా! నీవ్యూహంబులింక నీజగచ్చక్షువగు భానునికడ సాగవు.

(నిష్క్రమించును).

---

౨వ దృశ్యము.

(గంగాతీరమునఁ సూర్యోపాసనమొనరించుచు కర్ణుఁడు)

క—(దోసిలిపట్టి) ఓ తండ్రీ! సూర్యనారాయణమూర్తీ

శా. సోమాదిగ్రహసంతతుల్ వెలుఁగు, నీ శుభ్రప్రభారాసిచే
భూమిం బ్రాణులు తావకోష్ణముననే, పుట్టొందిజీవించు నా
నామార్గంబులఁగాల చక్రము, వినూత్నంబౌఁ బ్రచారంబుచే
స్వామీ! చండమయూఖమండల! సమస్తప్రాణిలోకావనా.

సీ. పరమాణువాదిగా బ్రహ్మపర్యంతంబు
నిండిన సర్వరూపుండవీవ!

జగములు వెలిఁగింప సంధ్యలు గల్పింపఁ
గారణాకారణాధారుఁ డీవ!
క్షారోదకంబును క్షీరోదకంబుగ
మార్చి లోకముఁ బ్రోచుమహితుఁడీవ!
ఆతనిపైజనుల ధర్మాధర్మకార్యంబు,
వీక్షించువరజగత్సాక్షి వీవ!
మహితసప్తాశ్వమండల మధ్యమందు
బహుసహస్ర మయూఖవిభ్రాజమాన,
మూర్తియుత గగనాంతర వర్తివీవ,
ధవళగంగా జలార్ఘ్య ప్రదానమిదిగో.

(అర్ఘ్యము వదలును.)

[సూర్యుఁడు ప్రత్యక్షమగుచున్నాఁడు]

సూ—కుమారా! కర్ణ! నీపితృభక్తి నాకానంద ... ఘటి యించె! దురాత్ముఁడగు నింద్రుఁడు తనసుతునర్జును ప్రాణములు గాపాడుకొనఁదలంచి కపటబ్రాహ్మణవేషంబునఁ నీకర్ణకుండలంబు లపహరించి నిన్ను నిర్వీర్యుం జేయుచున్నాఁడు. వాని మాయలం బడకుండ నిన్నుఁ గాపాడవచ్చితిని. హెచ్చరిక హెచ్చరిక!

క—తండ్రీ! నీయానతి శిరమునఁ దాల్చితిని! మీపలుకులచే నా మనంబిప్పుడ మందానంద కందళితంబయ్యె ఏమందు వేని.

ఆ. వితరణంబుచేత విశ్వంబు దనిపె నీ
కర్ణుఁడంతె కాని ఘనసుపర్వ
పతిమనంబు మెచ్చు భాగ్యంబుఁ గనఁడయ్యె
కలిగెనట్టిభాగ్య గరిమ నేఁడు.

ఈతఁడు నను మోసంబొనర్ప వచ్చుచుండెనని యానతిచ్చితిరి! మోసంబు రానిమ్ము దోసంబు రానిమ్ము! త్రిలోకేశ్వరునంతటి



మహామహుండుఁ కేలుసాచి, నన్ను దాతగా నెంచి తానర్థియగుటకన్న, నాకీజన్మంబునవలయు కృతార్థత వేరేమున్నది? నా ప్రాణాపాయకరంబైన సరే! మరేమైన సరే! ఇంద్రుఁడే నన్నర్థించువాఁడేని, ఈకవచకుండలంబులే కాదు. నా ప్రాణంబైన నిచ్చెద. వీరభోజ్యమగు సంగ్రామవిజయంబపేక్షించినవాఁడను గాను. నన్ను మోసగించి యింద్రుఁడీ యఖండ సామ్రాజ్యము నర్జునునొదలం గట్టి మృతిలేనివానిం జేసినను నాకు విచారము లేదు. తండ్రీ! నీకుమారునకు దానకర్ణుఁడను విఖ్యాతి నీవు వెలుంగునందాక గల్గుటే నాకోరిక! నీపలుకు నిరాకరించితినని, కోపింపకుము. నీకు నాపైఁగల వాత్సల్యంబునకిదే నమస్కారము.

సూ—ఓహో! మెచ్చితి బాలకా! నీయశోకాంక్షకు మెచ్చితి! దానకర్ణుండవై ప్రళయపర్యంతకీర్తిని ధరింపుము. (తిరోహితుఁడగును).

క—ఓహో! ఏమి నాభాగ్యము! అల్పుండనగు నాదానగుణధ్యానంబులెంత దూరము వినంబడుచున్నవి నాభాగ్యమే భాగ్యము.

క. ఎందాక సోమసూర్యుల
మందస్ఫూర్తిని ధరిత్రి మండింతురో, తా
నందాక కీర్తియుతుఁ డల
బృందారకలోకసుఖము వెలయఁగ నందున్.

[ఇంద్రుఁడు విప్రరూపమున ప్రవేశించును.]

ఇం—(స్వ) అల్లదే కర్ణుఁడు సూర్యోపాసనయందున్నవాఁడు. ఇదే సమయము (ప్రవేశించి) అర్థిజనకామితార్థప్రదుండవగు నో మహాకీర్తిశాలీ! నీకు భూసురాశీర్వాదములు.

క—(స్వ) ఇంద్రుఁడుగాఁ దోచుచున్నది. (ప్ర) భూమి నవతరించిన కేవలసురేంద్రులగు తమదీవనలం బరిగ్రహించితి.

ఇం—(స్వ) ఇదేమి? ఈతఁడిటులనుచున్నవాఁడు? నన్ను గుఱుతించెనా యేమి? కాదుకాదు భూసురేంద్రా యని పిలుచుచుండెఁ

గాఁబోలును. (ప్రి) దానగుణసాంద్రి! రాధాగర్భవారాసిపూర్ణచంద్రి! చిరకాలమునుండి, నిన్నొకవరమర్థింప సంకల్పించియుంటిని. అడిగినవారికాశాభంగము గల్గింపవనునీకీర్తి దిగంతవిశ్రాంతమయ్యె! కేలుసాచి వేడితినిఁ నాకోర్కెఁదీర్చి ధన్యునిఁ జేయవలయును!

క — ఈయర్థిజనదాసుఁ డింతగాస్తుతింప నర్హుఁడు! వలయుపదార్థమర్థింపుఁడు. అదినాశరీరమునఁగల కవచమైన సరియే కోసియిచ్చెదను!

ఇం — సెబాస్! కర్ణా! పరేంగితజ్ఞానమన్న నీధనము! నీసహజకవచకుండలంబులనే కోరి బహుప్రయాసమున నిందువచ్చితిని.

క — (కవచకుండలములఁ దీసియిచ్చి) నిస్సంశయముగ దీనిని దానముచేయుచున్నాను.

చ. ఇదియొకలిప్తపూర్వమున, నీయఁబడెందము కే, మనంబునన్.

ఇం — ఏమాశ్చర్యము? నారాకనీకెట్లు తెలసె?

క — చ. విదితముమీతలంపు; రణవీరుని, నర్జునుఁగావ, నన్నుని
ర్మదునొనరింపఁగాఁగొనిన, మార్గముగా యిదిదానవైఖరిన్.

ఇం — అట్లయిన నేనెవ్వఁడనో యదియు నీవెఱింగియుందువు.

క — చ. మదినికలంతయేల? గిరిమండలభేదివివజ్రపాణి వే.

ఇం — (లజ్జతో) ఓమహాపురుష! నీమాహాత్మ్య మెఱుంగలేక త్రిజగచ్ఛాసనపరాక్రమోపేతుండనగు దేవపతినై యుండియు, నింతటి మోసంబునకియ్యకొంటిని. ఇందు నేను కడుంగడునింద్యుఁడ! నేనింద్రుఁడననియు, మదుద్దేశ్యము దూష్యమనియు, నెఱింగియు, కేవల కీర్తికాంక్షచే లోకాతీతమైన సహజకవచకుండలప్రదానంబు గావించి కీర్తిఁగంటివి! నీవంటివాఁడు భవిష్యమునఁ గలుగఁబోవఁడు! నీభాగ్యమే భాగ్యము! నాయొనర్చిన మోసంబునకు మిగుల సంతాపము గలిగెను. అందులకు మాఱుగ పార్థప్రాణహరణ సమర్థంబగునీశక్తిబాణముఁగొనుము. (ఇచ్చును.)

క — కృతార్థుఁడను. (తెరవ్రాలును)

---



౪ దృశ్యము.

(కర్ణుఁడు — కూర్చుండియుండగా — కుంతి ప్రక్కన).

రంగము — గంగాతీరము.

క — తల్లీ! నీవెవ్వతెవు? రాధాగర్భభారభూతుఁడ నగు నేను కర్ణుఁడను.

కుం — మహాతేజశ్శాలివగు నోబాలకా! ఈసమస్తదృశ్యప్రపంచమున కాధారభూతుఁడగు సూర్యునికోసకు ప్రథమపరిచయముగల్గించినదానను నేను.

క — నీపరిభాష నాకర్థమగుటలేదు.

కుంతి — నేను పాండవమాతను.

క — కుంతిదేవివా? తల్లీ! నీవిటులరానేల?

కుం — నాహృదయము ద్రవీభూతమైయున్నది. నిరంతరాందోళనమువలనఁ గలిగిన యెదురుపాటుచే నాగుండెలు దారుణప్రకారము నఁగొట్టుకొనుచున్నవి. ఏ యకార్యకరణమును గావించినకారణమున నాజన్మమతిహీనాతిహీనమై పోయినదో యానిగూఢకార్యరహస్యమును వెల్లడింపవగుతరుణము గల్గినందున నాశరీరము స్వేదయుక్తమై గడగడ వణకుచున్నది.

క — ఇదంతయు నాకత్యంత విస్మయప్రదముగనున్నది. తల్లీ నీవు నిజముగా కుంతీదేవివా! నాప్రతిస్పర్థియగు నర్జుననిమాతవా?

కుం — అవును.

క — అటులైన నీహృదయము నాయందు ద్రవీభూతము కానేల? నేనెవ్వఁడను? నీవెవ్వతెవు?

కుం — అందులకు ప్రబలమగుకారణమున్నది. కుమారా! మనయిద్దఱకు నతిసన్నిహితమగు సంబంధమున్నది.

క—తల్లీ ! నీకన్నులుతుడుచుకొనుము. నీమాటలు నాకు బోధపడుట లేదు. అయినను

గీ. ఎగసిన నగాగ్రమందలి హిమకణము
తపనకరచుంబనంబున ద్రవముగా—ధ
రిత్రిబ్రవహించునట్లు నాహృదయమిపుడు
కరగుచున్నది; నీదృష్టి కాంతిచేత.

అదిగాక—నీకంఠస్వరముసయితము నాభూతచరిత్రమును, నాకుఁ దెలియనిదానినిస్వప్నమాత్రముగఁదోఁపఁజేయుచున్నది. మనసంబంధ మెట్టిది ?

కుం—నేను పార్థునితల్లినగుటచే నీకుశత్రుస్థానమనని నీవు తలంపవచ్చును. ఐనను నీవాభావము నీక్షణమాత్రము మఱచిపొమ్ము.

క—ఎందుచేత !

కుం—నీబాల్యమున నొకనాఁడు, హస్తినాపురమున, నస్త్రవిద్యాపరీక్ష జరిగెను. జ్ఞప్తియున్నదా ?

క—జ్ఞప్తికివచ్చుచున్నది. నీ వానాఁడు సందర్భహీనములగు వాక్యములతో రంగస్థలమున మూర్ఛిల్లితివి.

కుం—ఔను. అవి సందర్భహీనములని లోకులందఱును దలంచిరి. నీవునుఁ దలంచితివి. కాని, యామాటలయందు నామాతృవాత్సల్యము గూఢమైయున్నది. ఆనాఁడునీవు శరచాపయుతుండవై దర్పముంజూపితివి. అప్పటినీవీరప్రసన్న ముఖకమలమును నేనెన్నఁడునుమఱచిపోను. అప్పుడందఱిలో నిన్ను కన్నులతోఁగౌగలించుకొని,మనస్సుచే నాశీర్వదించినదీకుంతియని తెలిసికొనుము.ఆసభాంతరమున నీహీనకులప్రశంస వచ్చినప్పుడేడ్చిన దీకుంతియేయని యెఱుంగుము. సుయోధనుఁడు నీకంగరాజ్యమునిచ్చినపుడుఁ పాండవకుటుంబమున, నానందకందళితస్వాంతయైనయేకమాత్ర స్త్రీమూర్తియీపార్థమాతయే !



క—ఆనందించితిని. అటులైన నిన్నిపుడేమహాత్కార్యమిందుఁ గొనివచ్చెను ?

కుం—నిన్నొక్కటి వేడవచ్చితిని.

క—ఏమికావలయునో యాజ్ఞాపింపుము. సర్వదా సంసిద్ధుఁడ.

కుం—నీవే కావలయును.

క—నాకర్థమగుట లేదు.

కుం—నిన్నుఁగొనిపోవచ్చితిని.

క—ఎక్కడికి ?

కుం—నీతల్లి యొడిలోనికి.

క—నాతల్లి రాధగదా !

కుం—కాదు

క—ఏమిచిత్రము.

కుం—చిత్రమే జరిగియుండెను. ఇట్టిఘటనము లోకమునం దిదివఱకు లేదు. నాయందుదక్క—వింటివా! నాయనా! నిర్భాగ్యురాలగు నీకుంతివక్షమున క్షీరపానముసేయుటకు నీకెంతయో హక్కుగలదు.

క—అమ్మా ! మహావీరులైదుగురికి స్థానమమర్చుటచేతనే నీవు వీరమాతవైతివి. సామంతరాజునగు నాకుసైతము నీవక్షమున చోటుగలదా ?

కుం—అందగ్రస్థానమే నీది.

క—ఎటులు ?

కుం—మాతృగర్భమునబుట్టిన సర్వప్రాణిసముదాయమునకు నెటులో నీకును నటులే.

క—అట్లయిన నీగర్భమందా నేనుజన్మించితిని ? ఏడ్వకుము. కన్నీరు దుడుచుకొనుము.

కుం—నేను కన్యాత్వముననుండగనే దూర్వాసవరప్రభావమున భానునకు..... (గద్గదికయై మాటాడలేకుండును.)

క— జ్ఞప్తికివచ్చుచున్నది. నాతండ్రియగుదివాకరుఁడు మున్నొకమారీవిషయమునే వచించెను. ప్రత్యక్షముగ మాతృప్రేమామృతమును నేనిదేయనుభవించుట— తల్లీ! ఇటురమ్మా. నన్నుకంటివనుమాటయే కాని నీముద్దుముచ్చటలుతీరలేదు. నేనుశైశవమునందలి కుమారుడనేయనిభావింపుము. నాకిదియొకస్వప్నముగనలెఁదోఁచుచున్నది. నీకుడిచేతిని నాతలపైనుంచిదీవింపుము. నాతల్లిపోయినదని రాధ పెంపుడుతల్లియనిలోకులనుటకు మాయమ్మ రాధ సైరింపకుండెను. నాకుమాత్రమప్పుడప్పుడనకుంఠనవతియగునాతల్లి కలలోఁగాన్పించినట్లుతోఁచుచుండెను. ఆకలయే నేఁడుమరల వచ్చినటులున్నది. ప్రకృతిప్రశాంతముగనున్నది. తెల్లవారినంతనే భూనభోంతరాళము లదరునట్లు రణభేరి మ్రోఁగఁగలదు. ఈప్రశాంతకల్లోలసమయముల నడుమ— నామాతృసందేశ మేలరావలయు? అది పార్థునిమాతనుండియా! చిత్రముగదా తల్లీ!

కుం— కుమారా! రమ్మ.

క— ఎక్కడికిప్పుడు?

కుం— పాండవశిబిరమునకు!

క— ఎందులకు?

కుం— పాండవాగ్రజుఁడవగుటకు.

క— లాభము?

కుం— ఈకురురాజ్యముఁ బాలించుటకు నీకన్నసమర్థులెవ్వరు?

క— నెత్తుటికి శిశువునగునాపై దయాలేశములేక గంగకర్పించిన కఠినాత్మయగునాతల్లిచుంబనము నాకిఁక శాశ్వతముగఁగలుగవలసినదేనా?

కుం— అయ్యో! నేనెంతపాపాత్మను?

క— సందేహమేమి? జన్మస్వత్త్వమును జలములపాలుగావించితివి. స్వచ్ఛంద సహోదరప్రేమను గర్భశాత్రవముగ మార్చితివి.



రారాజపుత్త్రుని సూతపుత్త్రునిగఁ బ్రదర్శించితివి. కన్నకుమారుని గంగ కర్పించిననీకు ప్రేమయెక్కడిది? ఇప్పుడు పాండుపుత్త్రుఁడనని వచ్చుటచే నాకధికమర్యాదరాదు సరికదా పార్థునకు భయపడికర్ణుడీనైచ్యమును గావించెనని పలుకుదురు.

ఆ. విజయవిక్రమంబు విఖ్యాతమైయుండ,
నేను కౌంతికొడుక భానుజుండ
ననుచు నతనిఁగూడ నరిగిన, నతనికి
వెఱచిపోయె ననరె విశ్వ మెల్ల.

కుం— అటులేలపలుకుదురు? సూర్యప్రమాణములేదా?

క— ఉండనిమ్ము. పోయిననాకుల మీకక్షుర్తిచే రాదుగదా! అదిగాక నేనీశరీరమును సుయోధనునకిచ్చితిని. దీనియందు నాకేయధికారమును లేదు.

గీ. చిన్నతనముననుండి యనేకరాజ్య
సంతతులనిచ్చి, నన్ను ననంతవాసి
జేసినట్టి సుయోధనుఁ బాసిపోవ
సమ్మతించుటకన్నను చావుమేలు.

సుయోధనుని కన్న, నాకన్న దమ్ములును తల్లియు నధికయు గారు మఱియు నోమానవతీ!

గీ. నీవు గంగ కర్పించిన న్నిముసమాది
నన్నుఁ బెంచిన జనని నన్యాయముగను
గోతఁ ద్రోయుట విశ్వాసఘాతుకంబు;
వారి తిండిచేఁ గద యింతవాఁడనైతి.

లోకులెల్లఱు బరిహాసింప సిగ్గు లేక నేటికొకరాజకుమారుఁడనని బయలుదేరుటకు నాయాత్మసమ్మతింపదు. నేను కౌంతేయుఁడనని నీవెవ్వాఱికిని జెప్పవలదు. సూతపుత్త్రుఁడ ననిపించుకొనుటయే నాకిప్పుడు

గాంవతరము. నీకడుపునఁ బుట్టినందులకు నీపైభక్తిచూపెదను. నిన్ను మఱువను. నీకిదేనమస్కారము. నీయాశవదలి చనుము.

కుం—అట్లైన నేను పుత్త్రశోక మనుభవింపవలసినదేనా ?

క—గంగాజలంబుల నన్ను వదలినప్పుడులేనిపుత్త్రశోక మిప్పుడుమాత్రము నీకేలఁ గలుగును.

కుం—అట్లైన నీవిఁక నా కుమారుఁడవు కావా ? నాదరికి రావా ?

క—వచ్చెదను, కానియిప్పుడుగాదు.

కుం—ఎప్పుడు ?

క—అర్జునుని నేను రణమునఁ జంపినతరువాత నీ వంకకు వచ్చెదను. అప్పుడు పంచపాండవులు నీకు ప్రాప్తియగుదురు.

కుం—అయ్యయ్యో !

క—క్షమింపుము. అర్జునమరణవార్త నీకువిచారకరముగనున్నదికాఁబోలును తల్లీ ! వేయిమాటలేల? నీకైదుగురుకొడుకులేగాని ఆర్వురులేరనినమ్ముము. కర్ణుఁడుచచ్చెనా పార్థునితోఁబంచపాండవులు. అర్జునుఁడుచచ్చెనా నాతో పంచపాండవులు.

కుం—అట్టి వాగ్దత్తమేది ?

క—అవశ్యమిచ్చెదను. పార్థుఁడుదక్క మరేపాండునందనుఁడు నా చేఁజిక్కినను సంహరింపను. ఈవాగ్దానముచాలునా ?

కుం—చాలును. కుమారా ! చాలును.

క—తల్లీ ! ఇఁక నీవు మరలుము. పాండవులే జయించెదరని నేనెఱుంగుదును. అపరాజయమందు వారిపక్షమున నుండుటయే నాకంగీకారము.

కుం—హా ! హతాశను. తనయా ! ఒకమాట !

క—సావధానుఁడ నైయున్నాను.



కుం—కృష్ణభగవానుఁడు నేఁడే నీతోడ నేకాంతముగ సంభాషింపఁదలఁచియున్నాఁడు.

క—అతఁడును నిమిషమునే చర్చించుననితలఁచెదను. కృష్ణుఁడుమాత్రమునాకడనుండి యింతకన్ననన్యమగు ప్రత్యుత్తరమెట్లుపొందఁగలఁడు ?

(ఇరువురు నిష్క్రమించుచున్నారు)

చతుర్థాంకము

సంపూర్ణము.

---



# దానవీరకర్ణ.

పంచమాఙ్కము.

——:0:——

ప్రదేశము—విశ్రాంతిస్థలము.

(దుర్యోధనుఁడు, ధృతరాష్ట్రుఁడు, గాంధారి, సంజయుఁడు.)

దుర్యో—అమ్మా ! నాయనా ! భీష్మద్రోణులమరణంబులు నాకెంతమాత్రము నధైర్యకారణములు కావు చూడుఁడు !

చ. కుడిభుజమై నిరంతరము గూర్చెడువాఁడయి కర్ణుఁ డుండ నే
యడలున కేమికారణ మహర్పతినందనుఁ డాతఁ డల్పుఁడే ?
చెడుగుఁదలంచి పాండవుల శ్రేయము గోరి గతించినారు భీ
ష్ముఁడు గురుఁ డాత్మ నాఘనుల శూరతనమ్మితి మోసపోయితిన్.

ఇఁక నిప్పుడో—

మ. ధనురాచార్యుఁడు గూలినంతటనె రాధానందనుం జీరి యా
తని సేనాధిపుఁ జేసినాఁడ ! వివిధాస్త్రజ్ఞాత యాతండు త
న్మనమం దెప్పుడుగోరు నాహితమె, నానావ్యూహనిర్మాణ భీ
షణుఁడై శాత్రవదీప్తి నార్చి జయశశ్వత్కీర్తినిం గాంచెడున్.

ధృత—నాయనా! నమ్మికొనినవారు—కురుకులక్షేమంకరులు—వృద్ధులు—మహావీరులగువారందఱును గతించిరి. ఇఁక నూరు పేరు



లేని కర్ణుఁడా నిన్నుద్ధరించునది ! మహాగజములు పలాయనములగుచుండ మశకములలెక్కయేమి ? కావలసినయనుభవము లన్నియు నైనవి. పుట్టుగ్రుడ్డినగు నేనును నావలన గ్రుడ్డిదైన మీయంబయు కాటికి సమీపించి కాచుకొనియుంటిమి; నీపైననే మాప్రాణములను నిలుపుకొనియుంటిమి. మమ్మీపుత్రశోకదుఃఖముచే నేల జీవచ్ఛవములనుగాఁ జేసి చంపెదవు !

గాంధా—తండ్రీ ! సుయోధనా ! నాయనగారిమాట మన్నించుము ! పడుచుతనమే ప్రధానమనుకొనకుము. ఐనదేమో యైనది. ఇప్పటికైన నేదో యొకదారి చూచుకొనుము. నీచేతి మీఁదుగ నీకష్టలను గడతేర్చుము. భీమసేనునిప్రతిజ్ఞలు మమ్ము కలవరపఱచుచున్నవి.

దుర్యో—అమ్మా ! మీభ్రాంతియే కాని యిప్పటికైన దేమున్నది? భీష్మద్రోణులు వదలిరిపో నాశనివదలె. శ్రవణపేయముగ విన నుత్సాహపడినను వారు నాహితముగోరుపలుకొకటైన నాడిరే ! అట్టిద్రోహులు నాకు కర్ణునికన్న నెక్కువగారు. వారిజీవితంబులు పాండవస్తోత్రపాఠములతోడనే తెల్లవాఱె !

సంజ—రారాజా ! నిన్ను స్తోత్రముచేయకుండుటచే భీష్మద్రోణులు ద్రోహులైరా ? స్తోత్రపాఠములుచేయుకర్ణుఁడు ఘనుఁడయ్యెనా ? ఎంతవివేకమునుఁ బ్రదర్శించితివి ? వృద్ధుఁడై పదిదినము లఖండసంగ్రామము సలిపిన భీష్మునిసయితమెంత తేలక చేసితివి?

దుర్యో—మిమ్ముఁ దఱుముఁ బట్టుకొనిన పెద్దరోగమే యిది కాకున్న పదిదినములు యుద్ధముచేసెనని భీష్మునేల పెద్దఁజేసెదరు ?

గీ. పరశురాముని నెదిర్చిన బాహుశాలి
శస్త్రసన్న్యాసమును కోరి సలుపనేల?

చిరము పాండవహిత మపేక్షించియున్న
చంపువిధము వారల కెఱిఁగింపనేల ?

ఇంతకన్న ద్రోహ మేమికావలయును ? అదిగాక కర్ణుఁడు నన్ను స్తోత్రముచేయుచుఁ గాలముగడుపుచుండె నని నీవు పలికితివి! కర్ణుఁ డెప్పుడును నన్ను ముఖస్తుతిచేయలేదు. విద్వేషముచే మీరంద ఱట్లు నిందింతురుగాని యతఁ డట్టినీచోద్దేశములు గలవాఁడుకాఁడు.

ధృత—పోనిమ్ము; నాయనా! కర్ణుఁడు మంచివాఁడే యనుకొమ్ము. ఇంతవఱ కాతనిమంచితనమున నీ కైన దంతయు నాశనమే కాదా ?

దుర్యో—నాయనా! మీరు పొరబడుచున్నారు. అతని మంచితనమును చూపనిచ్చినవా రెవ్వరు ? అదేమి ప్రారబ్ధమో కాని, చిన్న మొదలు పెద్దదనుక నందఱు కాతఁ డనిన కడుపుమంటయే కదా ! పెద్దలుపెద్దలని నమ్మి తుద కిట్లు వ్యర్థుఁడనైతిని. ఇప్పుడు కదా కర్ణుని సేనాపతిం జేసినది.

గాంధా—నాయనా! కర్ణునకు మఱింత రాజ్యమిచ్చి సన్మానింపవద్దంటిమా ! వానిని నీయర్ధాసనమునఁ గూర్చుండఁబెట్టుకొనవలదంటిమా ? నీకోరికల కెవ్వ రడ్డమువచ్చినవారు ? కర్ణుఁడు కాకున్న నిన్ను రణమునకుఁ దింపినవా రెవ్వరు ? అతనికన్న నింతదనుక నుపేక్ష చేసినవా రెవ్వరు ? నీహితమునుగోరినకర్ణున కొకరిప్రోత్సాహ మేల? ని న్నేల కర్ణుఁ డింతకాలము సన్మార్గమునఁ బెట్టకపోయె ?

సంజ—రారాజా! వాదమున కేమి ? ఇప్పుడు నీకుత్తమవిధి శాంతిస్థాపనము.

దుర్యో—నీశాంతికి నాకర్థము తెలియుటలేదు.

సంజ—సంధియే శాంతి.

దుర్యో—ఛీ! సంధియా ?



చ. మరణమునందుదాఁక మహిమండలి నెల్ల నవక్రలీల, భూ
వరమకుటస్థరత్నమణిభాసితపాదతలుండనై విభా
కరశశితారక లుండుదనుకంగను కీర్తిఁ గాంతుగాని యీ
కరణి నమానుషంబు నరకంబగు సంధికి నాసగొందునే ?

ధృత—నాయనా ! ఎన్ని చెప్పిన నీమతమే యనుసరణీయమని కట్టడిపట్టుబట్టెద వెట్లు కొట్టుకొందువురా !

(తెరలో)

ఓహో ! కురుసేనాసమూహములారా ! అర్జునుఁడు వృషసేనుఁ దలపడి యుపాయకరంబుగఁ బోరుచున్నవాఁడు. ఈవార్త్త, సేనానియగుకర్ణున కెఱిఁగింపుఁడు.

దుర్యో—(ఆత్రముతో) సంజయా ! సంజయా ! కొంపలు కాలుచుండ, నూతులు త్రవ్వఁ బ్రయత్నించినట్లు మనమి ట్లాలోచించుచుఁ గూరుచున్న మహాపద్రవము ఘటించనున్నది. నీవు వృద్ధమాతాపితలను వివిక్తస్థలాంతరమునకుఁ గొనిపొమ్ము. నేను రణమునకరుగవలయు.

ధృత—నాయనా ! నామాట మన్నించి సంధికియ్యకొనవా? క్షణక్షణమునకును పాకము ముదురుచున్నది. పోరు ఘోరమగుచున్నది. ఒకింత యనుమతింతువేని సంజయుఁడు సంధిపతాకము నెత్తించును.

దుర్యో—(విసుగుతో) ఛీ! ఛీ! ముసలితనమున మతిచెడి నాయుక్తి నింతైన గైకొనక పాడిన పాటనే పాడుచున్న మీకేమి చెప్పిన నేమిలాభమున్నది ? నాయనా ! మీరు కంఠశోషపడి నాచేఁ గాదనిపించుకొని నామనస్సునిఁక కలఁతపఱుపకుఁడు. మీఫాలమున బ్రహ్మపుత్రశోకమే వ్రాసియున్నచో నెవ్వఱు తప్పింపఁగలరు ? ఎప్పుడు రణ మారంభమయ్యెనో యప్పుడే నన్ను లేనివానినిగాఁ

దలంపుఁడు. మీ రింక నరుగుఁడు. సంజయా! తల్లిదండ్రులకు దారి జూపుము. నాప్రాప్త మెట్లున్న నట్లగును. నే నేగెదను. (నిష్క్రి)

ధృత—సంజయా! అబ్బాయి వెళ్ళినాఁడా?

సంజ—ఆఁ! గదామాత్రసహాయుఁడై రణమున కేగినాఁడు.

ధృత—ఇప్పుడు విచారించిన నేమిలాభము? మొదటినుండియు గారాబమను నెపమున వీనిని పాడుచేసినదే నేను. నన్ను నయితే మాయుద్ధమున కేఁ గొనిపొమ్ము. ఏయలుఁగైన రొమ్మున నాటి శీఘ్రముగ మరణింతును. దుఃఖపూరితమైన యీజీవితమేల?

సంజ—విచారింపకుఁడు; కులముఁ జెఱుపు కుమారులం గన్నవా రెవ్వరి కిట్టిదుఃఖము తప్పినది? ఇటు. ఇటు. (అందఱు ని॥)

(తరువాత కర్ణుఁడు ప్రవేశించును.)

కర్ణు—

మ. విలయాంభోధర గర్జమానశ్రవణోద్భేదక్రియారంభమై
చలితోత్తుంగతరంగవారిధిపరిశస్తధ్వాన సాదృశ్యమై
కులశైలప్రవిదారణోద్భవమహాకోలాహలప్రాయమై
కలనంబోలి మదీయమానస మహో! గర్జించు నేఁడేలొకో.

పరజయమును లేదు; మాకు పరాజయమును లేదు. నామన స్సిట్లేల కావలయును? ఒకగడియకిందట నేదియో కోలాహలమైనది. హేతు వెఱుంగరాదయ్యె. అరాతిభేదనసమర్థములగు శరచాపంబులు నాకడ భద్రముగనున్నవి. నాసర్వస్వముం గూలిపోయినంత వంత స్వాంతమునఁ గల్గుచున్నది. ధైర్య మెంత కల్పించుకొనినఁ గలుగదు. సర్వతోముఖంబగు మత్సౌర్య మేమయ్యె (స్మృతినభినయించి) ఔను. మఱచితి. చిరంజీవి యొకవేళ రణమునకు రాలేదుగద? వచ్చిన వానికేవైన నపాయము రాదుగద!



[తెరలో కోలాహలము.]

(విని) ఏమది? పాండవసైన్యముల కోలాహలధ్వనులును విజయుని పాంచజన్యశబ్దంబును మిన్నుముట్టుచున్నవి. (తెరవంకఁ జూచి) ఓహో! సైనికులారా! ఏమిది?

ఉ. కర్ణశిలీముఖాగ్నులరికాననకోటులఁ గాల్చుచుండఁగా
దుర్ణయశత్రురక్తచయదుర్గమవాహిని పాఱుచుండఁగా
నగ్నలీల కౌరవమహత్తరసైన్యము పోరుచుండఁగా
కర్ణము లీస్వనంబు వినఁగా రణమేమి ఘటిల్లెఁ దెల్పుఁడీ.

(తరువాత తత్తరముతో వృషసేనుని సారథి ప్రవేశించును.)

సార—మహాప్రభూ రక్షింపుము. రక్షింపుము!

క—(తత్తరమున) ఆ! ఆ! ఏమిది? చిరంజీవిసారథివగు నీ విట్లు రానేల? ఏమైన నపాయము సంఘటిల్లలేదుగద!

సార—మహాప్రభూ! ఇంకెక్కడి చిరంజీవి?

క—ఆ! చిరంజీవియే లేఁడా? హా రూపజితశతమన్మథా! హా పరాక్రమకార్తవీర్యా! హా మదాజ్ఞావిధేయా! హా! వృషసేన కుమారా! (మూర్ఛిల్లును)

సార—మహారాజా! శాంతింపుము. శాంతింపుము.

క—హా! తనయా! హా! వృషసేనకుమారా! సమగ్రధనుశ్శాస్త్రప్రవీణ! కూలిపోయితివా!

శా. హాహాహా! విజితారిసేన వృషసేనా వీడితే నన్ను; నీ
బాహాశౌరము కన్నులారఁ గని యబ్రం బందుకేఁగాని యీ
దేహత్యాగఫలంబు గల్గునని యింతేని స్మదిందోఁపకే
సాహంకారతఁ బంపి యుద్ధమున నిర్జింపించితిన్ పుత్రకా.

సీ. కానవా? యిరక నీకన్నతండ్రిని నన్ను
కమలసన్నిభమైన కన్నుదోయి

బిగిఁగౌఁగలింపవా ? సొగసారనింక స
ల్లలితంబులైన బాహువులగదించి
వినిపింపవా ? నీదువీరవిహారంబు
చెలువారు నుడుల నీచిన్నినోట
వెరపింపవా శత్రువీరులనింక. నీ
రతరమహోగ్ర నారాచములను

గీ. ముద్దులొల్కెడి మోము మోమునను జేర్చి
యొసఁగవా కన్నతండ్రి ! నాకొక్క ముద్దు ?
వంశ వీర్యాలమొనరించి పరమపదముఁ
జేరితివె ? నాకు కడలేని చింతఁగూర్చి.

(మూర్ఛిల్లును).

సార—అకటా ! ఏమిది ? ఈమహారాజు విశేష దుఃఖాతురుండై మాటిమాటికిని మూర్ఛాగతుఁడగుచున్నవాఁడు. సేనాధిపతియే యిట్టి యవస్థనందియున్న నిఁక సేనలయవస్థల నడుగనేల ? (విసరుచు) మహాప్రభూ ! ఊరడిల్లి కార్యమునరయుఁడు.

క — సూతుఁడా ! నాకింకేటికర్తవ్యము ? నాయంతవాఁడై నన్నుద్ధరించునని, నాయాసలనన్నిటి నెవ్వనిపై నెలకొల్పియుంటినో, పరిపూర్ణ సుధాకరబింబమునుగాంచి యలరువికాసమునందు కుముదంబువలె నెవ్వనిమొగంబుఁగనినంత, నెట్టికష్టములు నెట్టిదుఃఖముల నంతతో మఱచి, మహానందసముద్రమున దేలియాడుచుంటినో ఎవ్వఁడు నాయానందజీవిత నవనాటకసూత్రధారియై నాందీగీతముపాడెనో యెవ్వఁడు సాటికుమారవిభులయం దగ్రగణ్యుఁడై తనప్రతాపంబును దిశాంతరముల నెగుడఁజేసెనో యానామోహంపుమొలక నాచిన్నారి తండ్రి నాబహిఃప్రాణము నావృషసేనుఁడునన్నుఁ బాసిన వెనుక నాకింక విజయాశయేల ! కర్తవ్యమేల ? కయ్యమేల ? ......నాయనా! వృషసేనా! తీరనిదుఃఖానలమును నాగర్భంబునదరికొల్పిపోయితివా!



తండ్రి ! ఏభోగంబు లనుభవించితివని నీకిపుడే నూరేండ్లు నిండె ?

గీ. వయసుమీఱిన మాపైన భ్రాంతిమాని
కూడెనే నిన్ను ముక్తికాంతాలలామ !
ఎందఱో రాజసుతలు మోహింప; మాని
పాపి మృత్యుకన్యక నెద వలచినావె ?

(మూర్ఛిల్లును.)

(తెరలో)

ఓరోరి ద్రౌపదీకచాంబరాకర్షణమహాపాతకీ ! దుశ్శాసనా ! ఎంతకాలమునకు నాభుజబంధంబునఁ బట్టుబడితివిరా దుర్మతీ !

చ. పరమపతివ్రతామణిని బంధకియందు ననూనచేలముం
బెరకి యమానుషక్రియలఁ జేసితివా ! కులనాశకారణా !
కరముల రెంటవక్షముఁ బెకల్చి, కవోష్ణపువేడినెత్తుటిన్
బిరబిరఁద్రావి కంఠమునఁ బ్రేవులుదాల్చెద పూవుమాలగా.

సార—(దృష్టి నిగుడ్చి) ఔరా ! దురాత్ముఁడగు భీమసేనుఁడెంతటిదారుణముఁ దలపెట్టినాఁడు. దుశ్శాసను నువ్వెత్తుగఁ దనవక్షస్థలమునఁ బిగియఁబట్టి—నిర్వర్తితప్రతిజ్ఞుఁడుగా నంకించుచున్నాఁడు. అంగరాజున కీతనివలన నేయపాయము మూడునో కదా ?

(భీముఁడు దుశ్శాసనుని శరీరము బిగియఁబట్టి రక్త
సిక్తాంగుఁడై భయంకరరూపమునఁ బ్రవేశించును.)

ఓహో ! కురుపాండవోభయ సేనాసమూహములారా ! ఈభీముని వీరాలాపము మీరందఱు నాకర్ణింపుఁడు.

ఉ. పాండవపత్ని ద్రౌపది సభాస్థలి నీడ్చినపాపరాసి ను
ద్దండరణస్థలంబున వధంబొనరింపఁ బ్రతిజ్ఞఁగన్న భీ
ముండితఁ డేడి నెత్తుటను ముంచి హితంబుగ మాంసఖండముల్
దండిని దే భుజించెడు వ్యథామతి భీతిలిపోకుఁడందఱున్.

ఈవార్తను దుర్యోధనమహారాజున కెఱిఁగింపుఁడు. పొండు. నన్ను గాంచిన భయంబున, మీాయాయుధంబులను నేలఁ బడవైచి బరువెత్తకుఁడు. నిర్వర్తితప్రతిజ్ఞామహాత్మ్యంబున రుధిరాస్వాదనకేళీ ప్రమత్తుఁడగు నీవృకోదరుఁడు మీాకెవ్వరికిని హానిసేయువాఁడు గాఁడు. వీని రక్తంబును దోసిళ్ళతోఁ దనివారఁ ద్రావితిని. వీనివక్షముం జెకలించి యామాంసము నాహరించి ప్రేవులచే కంఠమునలంకరించుకొనుటయే యవశిష్టము. ఈపని నాచాటునఁ గావించెదను.

(దుశ్శాసను లాఁగికొనిపోవును.)

సార—అమ్మయ్య! ఇప్పటికి నాప్రాణము లొకపట్టునకుఁ జేరుకొనినవి. దుశ్శాసనవధోన్మత్తుఁడై స్వవశతం దప్పియున్నందున, నన్నును, అంగరాజును దురాత్ముఁడగు భీముఁడు చూడక తనదారిం బోయెను. కానిచో నేమై యుండునో?

కర్ణ—సూతుఁడా! ఈకోలాహలమేమి?

సార—మహాప్రభూ! దేవరవారు మూర్ఛాగతులై యున్న సమయమున దురాత్ముఁడగు భీమసేనుఁడు దుశ్శాసనకుమారునిఁ దన పొట్టనుఁ బెట్టుకొనియెను.

క—ఆఁ! ఆఁ! దుశ్శాసనుఁడు వధింపఁబడెనా?

సార—చిత్తము.

క—హా! హా! విధి సంకల్పము.

చ. తనయునిఁ బాసినట్టి ననుఁ దాకురునాథుఁడె యూరడించునో,
యనుజ సమానసంపుమృతి కాలని శోకము నేనెయార్తునో
ఘనభుజశక్తి మా మదులఁగాల్చిన వాయుపృథాకుమారులఁ
దునుమగలేకపోయితిమి ద్రోహులకార్యములెల్లఁజూచుచున్.

ఆఁ! తునుమగలేకపోవుటయేమి? ఓరీ! భీమపార్థు లున్నయెడ కిప్పుడే పోవలయు; నారథము నిటుదెమ్మని సూతునితోఁ జెప్పుము.



సార—మహాప్రభూ! రారాజు మాతాపితలతో నిటులే వచ్చుచున్నాఁడు.

క—కటకటా! ఈస్థితిలో నామహారాజుమొగముఁ జూచుటకు నాకు మొగము చెల్లుటలేదు. ఐనను సన్నిహితుండగు మిత్త్రుని మాని పోవరాదు.

(తరువాత ధృత, గాంధా, దుర్యో, సంజయులు ప్రవేశింతురు.)

ధృత—(శోకముతో) హా! దుశ్శాసనకుమారా! దుశ్శాసనకుమారా! శవమును చేతులతోనైనఁ దడవని తృప్తినందుదమన్నను పాపి భీమసేనుఁడు నీశరీరమునైనను విడువక భుజించుచుండెనా నాయనా!

గాంధా—ఓరీ! దుష్టవృకోదరా! ఎంతటిరాక్షసజాతకంబున నీవు జనించినను, తమ్ముని నెత్తురు ద్రావునంతటి హీనరాక్షసచండాల కార్యమున కుపక్రమింపవలెనా? వానినిఁ జంపుటతో నీకు తృప్తి కలుగలేదా? రక్తపానముసయితముచేసి, కడుపునింపుకొనఁదలచితివా?

దుర్యో—అమ్మా! నాయనా! ఇంకెంతసేపు మీారిట్లడలిన నేమిలాభము? రాచపుట్టువుఁ బుట్టినవానికి రణమరణమునకన్న నుత్తమప్రాప్తియేది?

ధృత—నాయనా! గర్భశోకమునఁ బొగలుచున్న మాకు నీసమాధానములు చెవికెక్కవు. హా! దుశ్శాసన! దుశ్శాసన!

గాంధా—హా! కుమారా! దుస్ససేనా! నాకడుపుఁగాల్చి పోయితివా తండ్రీ!

సంజ—రారాజా! కర్ణుఁడు వచ్చుచున్నాఁడు.

దుర్యో—ఆఁ! ఎక్కడ నామిత్త్రుఁడు?

క—మిత్త్రమా! సుయోధన!

గీ. బాలు, వృషసేనుమృతికి జీవచ్ఛవమయి
పుత్త్రశోకాకులత, నీదుముద్దులతమ్ము

భీమసేనుఁడు చంపఁగ వెకలియగుచు
మరల జీవచ్ఛవంబైన వ్యర్థుఁ డిడుగో!

దుర్యో—(కౌఁగలించుకొని) మిత్రమా! దుఃఖింపకుము. కన్నీరు తుడుచుకొనుము.

క. నీకు వృషసేనుఁ డెటులో
నాకటు దుశ్శాసనుండు; నాకసతీల
క్ష్మీకరులై యిటుతీరని
శోకముఁ గలిగించి చనిరి సుమి! మన మదుల౯.

అయినను, మనమధైర్యపడి చేయునది యేమున్నది? నాకర్తవ్యమును నీ వాలకింపలేదు. ఇప్పుడు వినుము.

అ. అరివధంబొనర్చి హతబంధులకు తిలో
దకములిచ్చి యింక దక్కియున్న
వారితోడ నొక్కమారే డ్చి కౌగిళ్ళ
బెనఁగి, పోదమమరవీథి నపుడు.

కావున సర్వదుఃఖశాంతి యగు నాశుభకాలమదనుక నీవోపికతో నుండుము. ఇవ్వుడు బంధునాశనంబున కధైర్యముంబూని శత్రులను వధింపకపోయితిమా మనలను జనంబులు హీనులనుగాఁదలపోసెదరు.

క—మిత్రమా! దుఃఖాతులమైన నామనస్సు నీమాటలచే కలఁతఁదేరి ధైర్యముగల్గుచున్నది.

ధృత—సంజయా! ఎవరామాటలాడునది?

సంజ—మనసేనానియగు కర్ణుఁడు!

ధృత—నిజముగ కర్ణుఁడేనా?

సంజ—సందేహమేమి?

ధృత— సంజయా! నేను నమ్మలేకున్నాను. ఇన్నిదినంబులు వీరములాడి నేడుసేనానియైయున్నసమయమున నాకుమారునిదుశ్శా



సనుని నిండుప్రాణములను భీముఁడుదీయుచుండ వ్యర్థుఁడై సకర్ణుఁ డింక నుమామొగములంజూచుటకై బ్రతికియున్నాఁడా!

గాంధా— హా! కుమారా! కుమారా! దుశ్శాసనా! మా కీదుఃఖ మెన్నడుతీరునురా? నాయనా! నీవు వెలిగించిన యీమంట కన్నీటిచే నభివృద్ధియై మండదొడఁగినది రాతండ్రీ!

క—అమ్మా! నాయనా! నిజమే కర్ణుఁడంతటిద్రోహియే కావున ఇదిగో దోసిలిపట్టితిని.

గీ. ప్రాణసముఁడైన సుతుమృతివార్త వినియు
పగుల దీగుండె దారువో వజ్రమో త్వ
దీయశాపాగ్ని శిఖలసంధించి నన్ను
గాల్చుఁడీ! నిత్యమైనసౌఖ్యంబు గలుగు.

దుర్యో—తండ్రీ! శోకావేశంబున నీతనిపై నలుగు టేటి భావ్యము! దగ్గఱనుండి మేమందఱ మేమిచేయఁగల్గితిమి? అదిగాక పుత్రశోకంబున సౌజ్ఞారహితుఁడైయున్న కర్ణుఁ డీనిందలకుఁ దగినవాఁడు కాఁడు.

క—మిత్రమా! ఈనిందాపరిభాషలకు నేనవశ్యము తగిన వాఁడనే. నాయట్టివ్యర్థుని నమ్ముకొనిన నీవు మోసగింపఁబడితివి.

దుర్యో—మిత్రమా! జరాభారంబున తల్లిదండ్రులవలెనే నీకును పుత్రశోకంబున మతిచెడినదేమి?

క—(పౌరుషముతో లేచి) సుయోధన రాజేంద్రా! ఇఁక పుత్రశోకములేదు. పరాజయములేదు కర్ణుఁడన్న నెవ్వఁడో సమస్తసేనలకును నేఁడెఱుంగఁజేసెదను. మధ్యందినమార్తాండునిగతివెలింగి రిపుసేనల శోషిల్లఁజేసెద! ఇదె యుధిజ్యశరాసనము. ఇవియే సముజ్వలబాణపరంపరలు త్రిపురాంతకుఁ డెదురైవచ్చిన నేఁడు నన్నెదిరింపలేదు.

ఉ! చేసెద నేఁ డపాండవ; మజేయశిలీముఖకోటి నింపి, ఘో
రాసురమూర్తినై రిపులనందఱ నొక్కటనేలరాల్చి రా
కాసులకీయరిప్రకరకంఠములన్ భుజియింపఁజేట్టి యీ
భాసురరాజ్య మీవు పరిపాలనసేయ ముదంబుఁగాంచెదన్.

దుర్యో—మిత్రమా! నీవంతవాఁడవే యగుదువు, నీపరా
క్రమము నాకుఁ గ్రొత్తగాదు.

(తెరలో)

ఓహో! సేనలారా! మాయాయుద్ధవిశారదుఁడును రాక్షసుఁడును
నగుఘటోత్కచుఁడు కర్ణునిఁ జంపెదనని యాకాశమార్గమున నేగు
దెంచుచున్నవాఁడు హెచ్చరిక! హెచ్చరిక!

దుర్యో—మిత్రుఁడా! జాగరూకుఁడవై యుండుము. అదిగో
మింట వీక్షింపుము. ఘటోత్కచునియాకృతి గాన్పించుచున్నది.
వీనిని శక్తిబాణమునఁదక్క నొండైన సిద్ధించుటసాధ్యముగాదు.

క—దాని నర్జునునికొఱకు దాచితిని.

సంజ—వీనినుండి నీవు బ్రదికిన గదా అర్జునునిమాట.

దుర్యో—మిత్రమా! త్వరపడుము.

క—అక్కటా! ఇదియు నిట్లు వ్యర్థమయ్యెనా!

(బాణము వదలును, ఘటోత్కచుఁడు నేలగూలును).

(విశ్రాంతిసంకేతమగు యవనిక మెల్లగావ్రాలును)

విశ్రాంతికాలము.

పంచమాంకము.

---



# దానవీరకర్ణ.



## షష్ఠాంకము.

---

### ౧ వ దృశ్యము.

ప్రదేశము—యుద్ధభూమి.

(ధర్మరాజు, సారథి ప్రవేశింతురు.)

సార—మహాప్రభూ! ఇందు తమరు కొంతవిశ్రమించుటయే
సర్వోత్తమము.

ధర్మ—ఏల?

సార—సారథి సదా రథికుని క్షేమముం గోరుచుండుటయు
దానిని రథికుఁడు నిరాకరించుటయు నాచారమే కాని, దాని ననుస
రించి, తాము నయిత మపాయమునఁ బడవలదని నాప్రార్థన.

ధర్మ—ఇప్పుడు వచ్చిన యపాయమేమి?

సార—కర్ణుఁడు నేఁడుమహోజ్జ్వలుఁడై యున్నాఁడు. ఇది
వఱకే శరబాధితులైయుండిన తమకు కర్ణునివలన నేఁడెట్టి యపా
యమో యని—

ధర్మ—ఆఁ! కర్ణుని నేమి పెద్దగాఁ దలంచెదవు? కర్ణుఁడు వరప్రసాదియా యేమి?

సార—అటులే చెప్పుకొనుచున్నారు స్వామి?

ధర్మ—ఎటులు?

సార—పరశురాముని వంచించి కర్ణుఁడు బ్రాహ్మణవేషమున......

ధర్మ—అవును. నేనిదివఱకే యావృత్తాంత మానుపూర్విగ వింటిని.

సార—"నీకొక్కనాటి యుద్ధమున నీశరవిద్య కరగతముగు"నని భార్గవుఁ డనుగ్రహించిన వరవాసరము నేఁడే యని, కర్ణపరితాపమును దేరి చూడలేని సైనికులు చెప్పుకొనుచున్నారు.

ధర్మ—అవును. ఇదియును కొంతనిజమే. కాని క్షత్రియుఁడగువాఁడు రణమున రిపుఁ జంపవలయు. తాఁ జావవలయుఁ గాక! పలాయనంబు సేయుట దుష్కీర్తికరము. వ్రణబాధయు విశేషముగ నున్నది. కావునఁ గొంత విశ్రాంతిఁ దీర్చుకొందును రథమునాకడిమి చెట్టునీడకుఁ గొనిపొమ్ము.

[తెరలో శంఖానినాదము.]

సార—మహాప్రభూ! కర్ణుఁడు శంఖంబు పూరించుచు నిటే వచ్చుచున్నాఁడు. సత్వరము చనవలయును. (ఇరువురు ని॥)

[తరువాత శల్యసహితుఁడగు కర్ణుఁడు ప్రవేశించును.]

క—శల్యా! చూడుము. ఇప్పుడు నేను గావించిన శంఖానినాదంబు రోదసీకుహరంబును విహ్వలంబుఁ గావించె.

శా. నారాచాదిమహోగ్రబాణపటలీ నానావిధోల్లసముల్
సైరింపక ధృతిలేక పాండుతనయుల్ సంభ్రాంతినొందంగ, వి



స్మేరంబై ఖచరవ్రజంబు వొగడన్ మెచ్చంగనీచూడ్కి దు
ర్వారోదగ్రత నేఁడు చూపెద భుజావష్టంభసంరంభినై

శ—అంగరాజా! ఇప్పుడు నీదనినమాట యననిమాటయే

క—ఏల?

శ—నీ బాహుశౌర్యం బిప్పుడుకాదు.

క—సమరసన్నాహదోహలుండనై వచ్చిన యిప్పుడుగాకింకెప్పుడు?

శ—నీశంఖతూర్యారావవిదారణ దారుణంబగు పార్థునిపాంచజన్యంబుగలదు. అదిగాక సత్యపరాక్రములును, శౌర్యఘనులును, అఖిలాస్త్రధనులును, భుజవీర్యమహితులును, భూరితేజోనిధులును, నగు పాండురాజనందనుల పరాక్రమమును నీవల్పముగఁదలంచి, స్వాభిమానమున ప్రేరితుండవై పేలుట తగనిపని

క—(తనలో) ఈతఁడు కొంతసేపటినుండియు, నన్నుఁ దూలనాడుచు, పాండవులఁ బొగడుచున్నవాఁడు. ఈతనియుద్దేశ మెఱుంగరాదయ్యె. (ప్ర) మద్రరాజా! పాండవులశౌర్యమును నాశౌర్యము నుచూచెదవుగాక!

శ—ఆహా! చూడకేమి? ఇదివఱకు చూడలేదా? ఇఁక చూడనా? తినఁబోవుదానికి రుచులడుగనేల?

క—(తెరవంకఁ జూచి) ఓహో! కురురాట్సేనాసమూహములారా! నిర్వీర్యులగు పాండవులందలంచి మీఱెందంబుల కుందుఁ జెందకుఁడు. అధిజ్యశరాసనుండగు కర్ణుఁ డిదే మీకు బాసటయై యున్నవాఁడు.

(తెరలో)

దానవీరకర్ణునకు జయము.

(మరలఁ తెరలో)

అంగరాజప్రతాపాలాపాకర్ణన శీలురగు నో సైనికులారా!

అవధారు! అవధారు! రిపులోకవిజయుఁడగు రాధేయుఁడు సంగరబునఁ బ్రవేశించెఁ గావున, నేఁడపాండవంబయ్యెననియే దృఢసంకల్పులై మీరెల్లఱు సాహసంబు వేఁపున సంగ్రామము సలుపవలయును.

(మరలఁ దెరలో)

దానవీరకర్ణునకుజయ్!

క—శల్యా! చూచితివే! మదీయరణవిన్యాసంబున సైనికులకుఁ గల్గినయుత్సాహము! ఇదె చూడుము. నాప్రతాప మెట్లు శత్రుదుస్సాధ్యంబగునో!

మ. అరదంబెక్కి శరాసనంబుఁగొని తెంపారంగ, నే నేచి, సం
గరసంక్రీడకుఁజొచ్చినం దృణసముంగాఁ గొందు నద్దేవతా
వరునైనం గురు నాపగాతనయుఁ జావంజూచుటల్ వైరులే
తుకు, చెండాడెదనుగ్రతం దలలు నాదోర్దర్పముం జూడుమీ.

గాంగేయకుంభసంభవులు పాండవులం గెలువలేని యశక్తతచేతనో, కాక పాండవాభిమానంబుననో నేలఁగూలి మన కవమానంబు దెచ్చిరి. కాకున్న కురువీరులు పాండవులకొఱకా, యిన్నిదినంబులు రణంబుసల్పుట? నేఁడు దేవేంద్రాదులు గావ నడ్డైన, నడలక, పార్థుని రూపుమాపి కురురాజుఋణంబుఁ దీర్చెద.

శ—(నవ్వి) అంగరాజా! ఏమియీప్రలాపము? శూరులందుకార్యశూరులనియు, వాగ్శూరులనియు నిరుదెఱంగులుందురు. నీవీరెండవజాతిలోఁ జేరినట్లున్నది. కానిచో పార్థునిజయింపఁదలచిననీకీవ్యర్థభాషణంబులేల? పార్థునిపరాక్రమము లోక మెఱుంగదా! నీపోడిమి యింతకుమున్నె తేటపడదా? ఏటికీకొఱమాలిన యాత్మప్రశంస?

సీ. రాత్రిమైఁదాఁకి క్రూరతఁబోరి మగఁటిమి
వాసినయంగారవర్ణుకంటె
ఘోషయాత్రావిధిఁ గురురాజుచెఱవట్టి
మానమేదిన చిత్రసేనుకంటె
ఖాండవోద్యానంబు, గావనేర్వక సిగ్గు
పడి, చన్న, నిర్జరప్రభునికంటె
క్రీడాకిరాతుఁడై క్రోడంబునకుఁ గాఁగ
బెనచి చిక్కిన త్రిలోచనునికంటె

గీ. నెక్కుఁడైన వీరుఁడే నర్జునునితోడఁ
బోడుతు నోడుతుననినఁ బోలుఁగాక
వినుము సూతతనయ! మనబోటు లాతనిఁ
జెరుతుమనుట నోరు చేటుగాదె.



పార్థునంతదూర మేల బోయెదవు? పార్థునికుమారుఁ డభిమన్యుఁడే, మిమ్ము పద్మవ్యూహాంతరంబునఁ బడఁగొట్టి, తలలుగొట్ట సమకట్టఁడే! మీమీసతులమంగళసూత్రప్రభావంబుల నప్పటి కెటులో బ్రదికి బయటఁ బడితిరి.

క—శల్యా! ఏటికీరీతి మమ్ము వెఱపింపఁజూచెదవు? నీవెన్నిమాటలు చెప్పిన నే వెఱచువాఁడనుగాను. నాశక్తి పరిశీలింపఁ గోరి నీవిట్లనుచుందువు; దానికేమి? నాశక్తి మాటలతోఁ గాదు. ఇంకొకనిముసమున ప్రచండభండనాంతరమునఁ జూచెదవు గాక!

శ—కర్ణా! ఇవి రిత్తపలుకులుగావు.

గీ. అర్జునప్రతాపానలమార్పఁ గోరి
దగ్ధమగుదువుసుమ్ము రాధాకుమార!
కాంతిభాసితోజ్వల దీపకళికఁ గాంచి.
మిడిసిపడి కూలి కాలెడుమిడుతవోలె.

క—(అనాకర్ణితముగ) నీతోడనేమి? ఓహో! సైనికులారా! ఈనాప్రతిజ్ఞను మీరందఱును వినుఁడు.

గీ. జగతి నివ్వ డపార్థకృష్ణంబు సేయ
కర్ణుఁడను వచ్చినాఁడ! సంగ్రామమునకు
మానితంబగు నీకురుసేనలోన
నెచటనుండెనో యాపార్థకృష్ణయుగము
వారిఁ గాన్పింపఁజేసినవీరవరుల
కేది వలయునో కోరిన నిచ్చువాఁడ.
గజతురగరథాశ్వంబులో, కాంచనములో
భూమిదానంబులో? కాక పుణ్యసతులో.

శ—కర్ణా! నిలుపుము నీవీరప్రశంస! పార్థకృష్ణుల నీకొక్కరు చూపనేల? వారలే నిన్ను వెదకుచు నిందు రాఁగలరు. అందులకై యిట్టి రిక్తదానములు సేయనేల? అట్లు సేయు నపాత్రదానంబులు పరిహాసపాత్రంబులని యెఱుంగుము. అదిగాక రాధాకుమారా!

గీ. కొలఁది యెఱుఁగక కృష్ణుల కలనఁ గెలుతు
ననుచు శుష్కప్రియంబుల నాడెదీవు
కంటివే యేపాలంబునఁగాని, నక్క
సింగమును గెల్చెనను కథ యంగరాజ.

క—ఆఁ! ఏమంటివి? వ్యర్థుఁడగు పార్థుని సింగంబుగను, నన్ను నక్కగను బోల్చి యథేచ్ఛముగఁ బ్రలాపించినందులకు నామిత్రుఁడగు సుయోధనుని మొగంబుఁ జూచి యూరకుంటిని గాని నీపాపంపు నాలుక, యీవఱకే వేయిచీలికలు గావింపకుంటినా? శూరధర్మంబుల నెఱుంగని పిఱికిపందవగుటచే నిట్లు కారులు ప్రేలుచుంటివి? నీయున్మత్తపైశాచికప్రలాపంబులను నేఁడే యంతమునందించి యుందును. నాధైర్యంబు సెటఁ గలుప—నిరుత్సాహకరవాక్యంబులాడు నీవు పయోముఖవిషకుంభమవు—అయినను, సుయోధనాదేశంబున నిసారథ్యంబు నాకు దప్పదయ్యె. నీకు సమ్మతము కాదేని నారథంబు



తొలఁగి చనుము రథము సయితము నేనే నడుపుకొనియెద. నీ విట్టి బుద్ధులు నాకుఁ జెప్పనక్కఱలేదు.

శ—మదహంకారదుర్గుణవిధేయా! రాధేయా! నాపలుకులకుఁ గినిసి—నీవు చేయఁదగినది తుదకు రోదనమే! నాబుద్ధులు నీ కిప్పు డేల రుచించును? నే నిప్పుడు నీకీబుద్ధులు చెప్పనేల? అర్జునుఁడు గాండీవగుణనిక్వాణంబు సెలంగ గదిసి—నీశరీరమున, నక్షయంబులగు దన తూణీరంబులు నిగుడఁజేసియే—నిను బుద్ధిమంతుం యును.

ఆ. ఏను ధార్తరాష్ట్ర హిత మాచరించుట
కై పెనంగి చెవుల కప్రియంబు
లైన నిన్నిమాటలాడితి నాబుద్ధి
విని దురాగ్రహంబు విడువవలయు.

క—శల్యా! శల్యంబులనాటుపోటుమాటలు గాటనేయుచు, మృషోపచారవాక్యంబు లేల? నీకపటంబు నే నెఱుంగనివాఁడ నని తలంచితివో! కృష్ణపార్థులగరుడకపిధ్వజంబులు బెండుమాసినులకు భీషణంబులు నాకుఁ బరితోషణంబులు వేవురుగోవిందులు పదివేవురు పార్థులు బన్నినం బోరెద! నీవుమహాయుద్ధకోవిదుండవు గామింజేసి, వెఱచఱచికారు లరచెదవు మఱియు నక్కడిపక్షపాతంబున బ్రేలెదవో యెఱుంగను.

శ—కర్ణా! హితచింతకులగువారిమాట తిరస్కరించి యకారణాగ్రహంబు బూనుట వినాశదాయక మని యెఱుంగుము. అదిగాక నేను నీ కింకను హంసకాకీయోపాఖ్యానాదికథ లనేకములు బోధింపవలసియున్నది. కానిమ్ము. నీగతికి నే నేమిచేయుదును, చెట్టు చెడునాటికిఁ గుక్కమూతిపిందెలు పుట్టుట సహజమే కదా! అదిగో! చూడుము. మనకభిముఖమై వచ్చుచున్నయారథము శమననందనుని దిగాఁదోచుచున్నది.

క—ఏమీ? నేఁడు శమననందనుఁడు నాకభిముఖుఁడై రాదలంచెనా శల్యా! ఆలసింపక రథము నాతనికెదురుగాఁ దోలుము ఆతనితో రణక్రీడ సల్పుదును.

శ—అటులే చేయుదును.

(ధర్మరాజు ప్ర.)

ధ—ఓరీ కర్ణా! ఎందుబోయెదవు? నిలువుము. భార్గవుని వరంబు నీకెట్లు నేఁ డుపకరించునో చూచెదఁగాక!

క—కౌంతేయాగ్రజ! నిన్ను మోసంబున గెలుచుటకు నేను శకునిం గాను. పరాక్రమైకజీవనుండనగు కర్ణుఁడ! నాభార్గవవరంబు మరల్ప నీతరంబుగాదు. వృథాప్రగల్భంబులు మాని పటకుటీరంబునకు మరలుము.

ధ—ఓరీ! సూతకులాధమా! గృహంబునకు మరల నేను నీవలె పిఱికిపందను కాను.

ఆ. కయ్యమునకు జంకి గాంగేయుఁ డనిఁ గూలు
దనుక శరముఁ దాల్పననుచు మూల
దాగినట్టి మేటిదర్పోద్ధతుండవు
లజ్జ వలదె? కారుల న్వచింప.

క—శమననందనా! రణంబునకు జంకియే నే నప్పుడు సత్త్రసన్యాసంబు సలిపితినో పంతంబునకే నిలచితినో యూహించినవారలకు విశదంబగు. దానికేమి? నీశౌర్యమునకు నీ విటులు సన్నాడదగినది కాదు. ఏమంటివా?

చ. మగఁటిమి లేక జూదమున మాకు భయంపడి యే, సభ్రాతృకం
బుగ గహనస్థలంబులకుఁ బోయి త్రయోదశవత్సరంబు ల
త్యగణితబాధలంబడినయాహవబోహాలు లైనపాండవుల్
జగతిని లాతివారిబలసంపదఁ గాంచి హసింపఁజెల్లునే?

ధ—ఓజ్ఞానహీనుఁడా! మాధర్మప్రవర్తనంబు తుదకిట్లు నీ



కర్థమయ్యెనే? ధర్మపాశబద్ధులమై మేమట్లు త్రయోదశవర్షనిబద్ధంబగు దీక్షకుఁ గట్టుపడి సహోదరులతో నిడుమలంగుడువవలసివచ్చె గాని మీవలె కపటదురోదరఖేలనలోలురై దురుద్యోగమే జీవనముగా గలిగిన కపటశీలురము గాము. అదిగాక కురుపాండవవంశనాశనం బింతపట్టు నీవలనఁగదా సంఘటిల్లె! పాపీ చిరాయువనునట్లింతదనుక నందఱియాయువులు బోసికొని నీవొక్కఁడవు జీవించి యింత జేసితివి. తొలుదొలుత నీవే నశించినచో నీపెనుముప్పునకు హేతువు లేకుండునుగదా!

ఆ. అంగరాజ నని యహంకృతిచే నన్న
దమ్ములకును పగలు దాపినావు
ఇంతఘోరమునకు నీవె మూలంబవు
భరతకులము నీదుపాలఁ బడియె.

శ—ధర్మజా! కర్ణుఁ డింతవఱకు వాచాశూరత జూపెను. ఇఁక బాహుశూరతయేమో తెలియఁదగియున్నది. కర్ణా! ఎంతకాలమిట్లు శమనసూనునితో వివాదపడియెదవు? ఇది సమరభూమి కావున మనబోటివారికి చలోక్తులతో కాలవిళంబన మొనర్చుట నీతికాదు.

క—శల్యా! నాతలంపునదియే! పాండునందనా! ఇఁక మనకు వివాదముతోఁ బనిలేదు. సంగ్రామమునకు రమ్ము.

ధ—సిద్ధముగ నున్నాను.

(ఇరువురు యుద్ధముచేయగా ధర్మరాజు మూర్ఛిల్లును.)

క—ఈతఁడు మూర్ఛాగతుండయ్యె! ఇఁక మన మీతనిఁ జేయదగినది లేదు. రథమును వేఱొకయెడకుఁ దోలుము.

శ—కర్ణా! అదె చూడుము. రథ మావంకకు మరలింతునా?

ఉ. అల్లదె! యర్జునధ్వజవిహారము గానఁగనయ్యెడుం గపీం
ద్రోల్లసనంబునన్ మెఱసి యుద్భటులైనద్రిగర్తు లేపుతో
భిల్లఁగవారె యన్నరుని బెట్టుఁగ దాకి రతండు నంప పె
న్వెల్లినిగుప్పి ముంచె నిదె నింగి గుణధ్వని వ్రోంగవారలన్.

(ఇరువురు నిష్క్రమింతురు.)

[సూతుఁడు పటాక్షేపముగఁ బ్రవేశించును.]

మహాప్రభూ! మహాప్రభూ! కటకటా! ఇం కెక్కడి మహాప్రభువు దారుణరణాంతరంబునఁ గూలినయాయన కెట్టియపాయంబును రాకమున్న రణభూమిం దొలఁగింపవలయు. రథంబును, నశ్వంబులును, కేతనంబును భగ్నంబులయ్యె. చేయఁదగినమార్గ మేమియు గాన్పింపదయ్యె. నేఁ డీకర్ణునిపరాక్రమ మాలోకింప జగద్విలయ మొనరించు వైఖరి దోఁచుచున్నది. (దూరముగాఁ జూచి) అదిగో! సహదేవకుమారుఁ డిటులనే వచ్చుచున్నవాఁడు. అతని రథంబున నీయనంగొని శిబిరంబుల కరుగుటే శ్రేయము.

[సహదేవుఁడు ప్రవేశించును.]

సహ—సూతుఁడా! పెద్దన్నగా రెక్కడ?

సార—మహాప్రభూ! పొలికలనసాజ్ఞారహితులై యీదెసఁ బడియున్నవారు.

సహ—అపాయము లేదుగద?

సార—కృష్ణకరుణావిశేషమున నిప్పటికి లేదు.

సహ—శిబిరంబున కరుగుదము. జాగ్రత్తగాఁ బట్టుకొమ్ము. ఆవల రథముఁ గలదు.

సార—చిత్తము.

---

౨వ దృశ్యము.

ప్రదేశము—యుద్ధభూమి.

[కృష్ణార్జునులు ప్రవేశించుచున్నారు]

కృ—పార్థా! నేఁడు మీపెద్దన్న రణమున కరిగెను. కర్ణునితో సంగ్రామ మొనరించుచుం[illegible]సి యింబాకటి సైనికకోలాహలములవలన సూచింపఁబడియె. కర్ణుఁ డీదెస కొంటరిగ నరుదెంచుచున్నా



వాఁడు. దీనిం బరికించి చూడ మీయన్నగారి కేదియో యపాయము కలిగెనని నేఁ దలంతును. ఇప్పుడు సంగ్రామమధ్యమున కరుగుట శ్రేయమో—పటకుటీరంబులకరుగుట శ్రేయమో—చింతింపుము.

అ—బావా! సోదరునిస్థితి యెటులున్నదో కాని—కర్ణుని తేజంబు నేఁ డనివార్యమై యున్నది. ఆతనియెడ నీసునంజని మన మపాయముఁ దెచ్చుకొనవలదు. చచ్చినవెనుక సాధించున దేమున్నది? జయార్థియగువాఁ డుపాయంబున మెలంగవలయును. కావున రథంబును పటకుటీరంబులకు మరలనిమ్ము.

గీ. "పటపగటింటిసూర్యునిపగిది కర్ణు
డుగ్రమూర్తియై వెలుఁగుచు నున్నవాఁడు
మనరథం బిప్డు మాధవ మరలనిమ్ము
బ్రదికియుండినఁ దినవచ్చు బలుసుకూర."

కృ—ఇప్పటి కింతకన్న క్షేమోపాయము లేదు.

(ఇరువురు నిష్క్రమింతురు.)

---

౩వ దృశ్యము—ప్రదేశము—పాండవశిబిరము.

(శరబాధచేతదొరలు ధర్మరాజు—పాదములకడ సహదేవుడు ప్ర)

ధ—(తనలో) ఎన్నిసారులు నాచేఁజిక్కలేదు! ఎన్నిసారులు నిరపాయులుగఁ జేసి విడువలేదు. ఊఁ! అందులకే నేఁడు నన్ను ప్రాణములతో విడిచినాఁడని సమర్థించుకొందమా! ఎందులకు? నిరర్థకములగు ప్రాణములు? మానము పోయెనే! ఈప్రాణము లీనరకబాధ ననుభవించుటకుగదా శరీరమును విడువకున్నవి! భగభగమండుచున్నవి. ఉద్రేకమున వ్రణపట్టికలు. చెదరి రక్తస్రావ మగుచున్నదే! ఉస్—అబ్బా! ఈశయ్యయందు చీమలు ప్రాకుచున్నట్లున్నవి! సహదేవా!

స—ఇచ్చటనే యున్నాను.

ధ—వీవన—వీవన—

స—చిత్తము (విసరుచున్నాఁడు.)

ధ—గాలిఁ వీచునప్పుడు ప్రజ్వరిల్లు మంటవలెనే నీ వీవన గాలిచే నాశరీరము మరింత మండుచున్న దేమి ? తమ్ముఁడా ! ఆవీవన నొకమూలనుంచి ద్వారమువఱకరిగి చూడుము. కర్ణునిజంపి చిన్నన్న వచ్చుచున్నాఁడేమో!

స—అలికిడి లేదు.

ధ—లేదా ! పాప మాపాడుకర్ణునితో తమ్మున కెంతఘోర రణమగుచున్నదో; అయినను కృష్ణుఁడు దగ్గరనే యుండునుగదా ! చూఁడు సహదేవా—భీమన్న యేఁడీ

స—యుద్ధమునందే యున్నాఁడు.

ధ—సరి. ఈసారి భయములేదు. కర్ణునిరూపుమాసినదనన మాటయే— ఆద్వారమున నాధ్వని యేమి ?

స—ద్వారపాలకుఁడు—

ధ—పార్థుఁడుకాఁడా ?

స—కాఁడు.

ధ—అటులైన పార్థవిజయధ్వానము గాని కర్ణమరణకోలాహలముగాని సైనికులు చెప్పుకొనుచున్నారేమో విను.

స—ఇంకను లేదు.

ధ—ఇంకను లేదా ! మఱియింకెప్పుడు ? కర్ణునిచావున కింకను నాలస్యమా ! నాశరీరమునందలిబాధ తీరకముందే వానిచావుమాట విందుననుకొంటినిసుమా ! అర్జునున కేమిమాంద్యము ?

స—ఈపాటికి వచ్చుచుందురు.

ధ—నాకన్నులు మూఁతలుపడుచున్నవి. వేదనముగనున్నది. అర్జునుఁడురా వేగమే నిద్రాభంగమని తలంపక నన్ను లేపుము.



స—చిత్తము.

ధ—(కన్నులుమూసి కొంతవడిదొరలి లేచి) నాకెక్కడి నిద్ర ? కర్ణుఁడు. కర్ణుఁడు. కర్ణునిచావుచూడవలయు. నేనిద్రింపవలయు. కూర్కురాకున్నదిగదా? కన్నులు తెఱచినకర్ణుఁడు—కన్నులుమూసిన కర్ణుఁడు—(కన్నులుమూయును)

(కృష్ణార్జునులు ప్రవేశింతురు.)

కృ—పార్థా! మనమనుకొన్నంతయయినది. చూచితివా ! మీపెద్దన్న వ్యాధిశయ్య—

అ—అయ్యయ్యో ! శరీరమెల్ల వ్రణములై బాధపడుచున్నటులున్నాఁడు. (దగ్గరకేగుదురు.)

స—మహారాజా ! చిన్నన్న వచ్చినాఁడు.

ధ—ఆఁ ! ఆఁ!! వచ్చినాఁడా ! ఏఁడీ? నాయనా! విజయుండవగు నిన్నుఁ జూచుటకే తల్లడిల్లుచుంటినిసుమా ! (కౌఁగలించుకొనును)

అ—మీశరీరము వ్రణపీడితమై యున్నటులున్నది. బాధతగ్గ లేదా? అయ్యయ్యో ! తమరేల రణమునకరిగితిరి !

ధ—నాబాధమాట కేమి ? కర్ణునిసంహరించివచ్చిన నిన్నుఁ జూడఁగనే నాయలమటయంతయుఁ దీరినది. ఈయానందమున—చూడు—నాకన్నులవెంట నానందబాష్పము లెట్లుకారుచున్నవో! అవమానమనునది యెఱుంగనినన్నిట్లు దుర్భరశరబాధాసహితునిఁ జేసివిడిచిన కర్ణపిశాచమిప్పుడుగదా భారతమును వదలిపోయెను !

అ—అబ్బా ! పాడుకర్ణుఁడు తమ్మెంతబాధపెట్టెను ?

ధ—ఇప్పుడు నాకేమియు బాధలేదు. కర్ణుని నీవు చంపితివను నానందమే నాకుచాలు. తమ్ముఁడా ! ఆక్రూరుఁడు నాఁడు ద్రౌపదిం బరిభవించినసభలో కూసినకారుకూతలకుఁ దగినఫల మనుభవించెను గదా ! పాపము వాఁడు సేవకమాత్రుఁడుగాన నట్లాడెనుసుమా ! పార్థా !

ఆ. కలన నెట్లు నీవు కర్ణుని వధియించి,
ఘోర వేశమనసు కలఁతపఱచి
నీప్రతిజ్ఞ నేఁడు విండించుకొంటివా
విధముఁ దెలుపు చెవులవిందుఁ గాఁగ.

అ—సోదరా! మీ రింక తల్లడిల్లవలదు. ఆరాధాసుతుండు మరణించెనే యని నమ్ముఁడు. సంశప్తకసేనలతో నేఁ బోరుతఱి నశ్వత్థామవచ్చి నన్నుఁ గవిసె. అందుచేనప్పటికి కర్ణుఁడు నాపాలఁబడక దక్కెఁగాని యిప్పు డాపాపి బ్రదికిపోఁగలఁడా.

గీ. పంపు మిప్పుడె నేఁ జని పరమపాపి
యైనకర్ణుని వధియించి యసితలమునఁ
దచ్ఛిరంబును నీదుపాదముల చెంత
నిలుపకుండిన నీయాన కృష్ణునాన.

ధ—(తెల్లపోయి) అట్లయిన కర్ణుని నీవింకను చంపనేలేదా?

అ—ఇప్పటికి చంపలేదు. ఇఁక చంపనున్నాను. అందులకే మీయనుజ్ఞ వేఁడ వచ్చితిని!

ధ—ఓయసమర్థుడా! శత్రునిజంపివచ్చుటకునాయాజ్ఞ యెందులకు? శల్యంబులనాటిననాపరాభవముఁదీర్ప నీవు దిక్కైతివని నేదలంచినందులకుగదా నీ కింతయుదాసీనత గలిగెను, రణమునవీరుఁడు జయింపవలయు. చావవలయు. కాని యిట్లుపాఱివచ్చిననా కింతకన్న సన్మానమేలజరుగు?

అ—అన్నయ్యా! నాతప్పుమన్నింపుడు! ఇప్పుడే చని కర్ణుని వధించివచ్చెదను.

ధ—నేనే. ఓడితిననుమాటయేమి? నేటికి నీవును కర్ణునకోడితివనినమాటయే! భీమనకులసహదేవు లంతకుమున్నే యోడిరి. మనతోఁజేరినకతమున కృష్ణుఁడుసయితమోడెను, ఇట్టినిరర్థకులమగు



మనకు రణమేల? రాజ్యమేల? విజయమేల? అందఱమునడవులకుఁ జని తపసులమైయుందము.

అ—అంతమాట లేలయాడవలెను?

ధ—శౌర్యము లేనప్పుడు మాటలకేమికొదువ? తపసులమగుట హీనతగనున్నదా? కర్ణునిచెప్పుదెబ్బలకభిమానములేదా? ఇంతకన్న కురురాజుకాళ్ళుపట్టుకొనిన మనకాన్గుర కారుపిండంబులు వండించిపెట్టఁగలఁడే!

కృ—బావగారూ! శాంతింపుఁడని ప్రార్థించెనుగదా! శాంతినందఁగూడదా! తీవరించినవ్రణబాధచే నుదయించినకోపమును పార్థునిపైఁజూపఁ దగునా?

ధ—కృష్ణా! ఇది వ్రణబాధోద్రేకమా! కర్ణునిఁజంపనందులకుఁ గలిగినలజ్జాభరము కాదా! పాండవులతోపాటు నీకును లజ్జాకారణమేసుమా! ఈవాచాశూరుఁ ప్రగల్భంబులు తొలుత గుర్తింపనైతిని. ఇట్టి పురుషాకారముదాల్చిన యాఁడువాని నెఱుంగలేక రణమునకు సిద్ధమై యవమానంబునకు పాలైతి ఓరివ్యర్థ! పార్థ!!

ఆ. కర్ణునని వధింపఁ గలనంచుఁ గొఱమాలి
పట్టిప్రతిన లెన్నొ యాచరించి,
తుదకు రిపులనడుమఁ ద్రోసితి గోత్రిలో
నన్ను, లోకమెల్ల నవ్వుకొఱకు.

అ—ఎందులకీనిష్ఠురవాదము చేసెదరు?

ధ—నిష్ఠురమా నావాదము? నీకార్యము నిష్ఠురముగాదా? దేవతలిచ్చినతేరును నశ్వములునుఁ గలవఁట! కపికేతనమఁట! తాటియంతవిల్లు గాండీవముగలదఁట! హరిసారథ్యమఁట! ఛీ నీపౌరుషము ఇఁకనుకర్ణునకోడిపోవలయునా? నాప్రారబ్ధమున కుఱ్ఱలు ఘటోత్కచాభిమన్యులు చచ్చిరిగాని వారు బ్రదికియున్న నిట్లుచేయుదురా?

నన్నుపరిభవాగ్నిచేఁ గాల్చి చంపుటకు వారు నీవలె పిఱికిపందలుగారు సుమా ?

ఉ. పాండవమధ్యముండ ననుపౌరుషమేమిటి కింక నీవు నీ
దండ నెయున్నచక్రిని రథంబుననుండగఁ వేఁడి, తత్కశా
దండము కేలఁదాల్చి యరుదారగసారథివై మెలంగి నీ
గాండవమిచ్చినన్ హరికి, కర్ణునిఁ గిర్ణుని మన్ను సేయఁడే.

అ—(కోపముతో లేచి) సహదేవా ! నాకరవాలమేది ? నా కరవాలమేది ?

కృ—కర్ణుని జంపఁదలఁచి చనుచుంటివి గావలయు! నేనుగావలదా ! గాండివముంగొనుము. కరవాలమేల ?

అ—కర్ణునిఁ గాదు. ఈధర్మజుని జంపెదను.

కృ—ఆఁ ! ఆఁ !!—మతి చెదరెనా ?

అ—నాకు మతిచెదరలేదు. మతిచెదరిన యీయమునకుమారుని యమపురి కంపెద.

కృ—అర్జునా ! ఏమనుచుంటివో తెలిసియే మాటాడుచుంటివా ! అపచారముసుమా యిది !

అ—అపచారమా ! కాదు.

గీ. ఇతరులకునీదుగాండీవ మిమ్మటంచుఁ
బలికినదురాత్ముశిరమునుఁ బగులవేయఁ
బ్రతినదాల్చితి; నది తీర్పవలయు నేఁడు
శాంతిలేదిఁక నితని సంహరింతు.

కృ—ప్రతిజ్ఞలకేమి ? పగతురయెడగాని, ప్రతిజ్ఞ బంధువుల యెడలనా ? అట్టిప్రతిజ్ఞ సోదరునియెడ దీర్పకున్న హానిదోషముసంభవింపదు.

ధ—కృష్ణా ! వారింపకుకుము—వారింపకుము.



చ. కుటిలుఁడ వంశఘాతుకుఁడ కూరిమితమ్ముల దారుణాటవీ
తటులఁ ద్రియోదశాబ్దములు దారుణబాధలపాలుఁజేసి, నేఁ
డిటుల నరాతిబాణముల కేమియు సేయఁగలేని నాశిరం
బటమటలేక దూల్చి మనసార సుఖింతురుగాక పాండవుల్.

కృ—పార్థా ! వింటివా ? నీయన్నగారిమాటలు. ఆమహాత్ముని మనంబును పరితాపంబుపాలుసేయకుము.

అ—కృష్ణా ! నీ సానునయవాక్యంబులను గట్టిపెట్టుము. ఓవీరమ్మన్య ! శమనకుమార !

సీ. నిఖలసంపదలోడి నీమూలమునఁగదా
పడఁతితో నగచాటు బడితి మేము
నిజదార నొకకూళ నీమూలమునఁగదా
మానభంగము సేయఁ బూనె నాఁడు
నిలువనీఁడ దొరంగి నీమూలమునఁగదా
కందమూలములతో గడపినాము
నిర్మలయశమేగి నీమూలమునఁగదా
జూదరులని మాకు వాడుగల్గె

గీ. తుదకు నీమూలముననె బంధువులచెంత,
రోసములుమాని దాస్యము జేసినాము
ఏకచక్రంబునను భిక్షమెత్తినాము
కలదె నీమూలమున మాకుఁ గలుగుమేలు.

ఇంతేకాదు: నీవు ధర్మమని, శాంతమని చేతగానితనమునమాగొంతుకలు కోసితివి. నేఁడును చేతగానితనముననే కర్ణునిచేఁ దెబ్బలు దిని వచ్చి మాకందఱకు తలవంపులు దెచ్చితివి.

గీ. సిగ్గుపడి చావ కిట్లిల్లుజేరినట్టి
పాఱుబోతును నినుగాంచి పాంసురాజ

భరతకులగౌరవము పాడువడియెనని, శ
పించి పరలోకమున నె దుఃఖించు నేఁడు.

కృ—అర్జునా! మీయన్నగారిని దూషించుచు నీవుమాత్రము భరతకులగౌరవ మేమి నిలిపితివి. కర్ణుని వధింప శక్తి లేక సోదరునితో దగవులాడుచుంటివి.

అర్జు—కృష్ణా! ఏమి నీ తెలివి తేటలు. నాకు కర్ణుని వధింప శక్తి లేదా? కలదో లేదో నీ వెఱుఁగ వేమి? ఈయుధిష్ఠిరుఁడు పలికినట్లే తెలివిమాలినపలుకు పలికితివి. నాకీకర్ణుఁడా లెక్క? ఛీ! ఎంతహీనఁపుమాట!

సీ. క్రీడాకిరాతుఁడై యోడి పాశుపతంబు
నర్పించినట్టి యాహరుఁడు సాక్షి
మత్ప్రతాపాగ్నిని మసియై సమసినట్టి
కాలకేయాదిరాక్షసులు సాక్షి
ఖాండవోద్యానంబుఁ గాల్చినప్పటి చరి
త్రకుఁ డీల్పడిన శచీధవుఁడు సాక్షి
ధైర్యంబున నెదిర్చి, తాళక పాఱిన
శౌండుఁ డంగారపర్ణుండు సాక్షి
గీ. భళిరె యన ద్రౌపదీస్వయంవరమునాఁటి
ధరణిపాసాధ్య మత్స్యయంత్రంబు సాక్షి
అరయ నివిగాక నెన్ని సాక్ష్యములు లేవు
కర్ణునకు భీతిగల్గునే కంసవైరి.

కృ—పార్థా! బాగు బాగు. నీకంతకంత కున్మాదము గల్గుచున్నటు లున్నది.

ధర్మ—కృష్ణా! ఇది యున్మాద మెటులగును? నాయనా! అర్జునా! అంతయు కడు సమంజసముగ జెప్పితివి. ఔను. నేనే పాఱుబోతును; నేనే పాపిని. నామూలముననే మీకింత చేటు గలిగెను.



గీ. భీరువును శక్తిహీనుఁడ; పాఱుఁబోత
నైన, నావల్ల కలిగె మీకపయశంబు
ధరణి గిరగిర దొరల నాశిరముఁ ద్రుంచి
సుఖమునందుఁడు ద్రుపదసుతయు మీరు.
ఇదిగో! చంపుము. చంపుము. ఊఁ! చంపవేమి?

కృ—అర్జునా! ఏమి యీకుటుంబకలహము? ఏమి యీమౌఢ్యము?

ధ—ఛీ! అసమర్థుఁడవగు నీ వేల నన్ను చంపుదువు? చాపఁదగినకర్ణునే చంపలేకపోయితివి! చంపఁదగిననన్ను చాపఁగలవా? కానిమ్ము, నేనే యాత్మవధంబున మీకుసుఖంబుగలిగించెదను. (పొడుచుకొనఁబోవును.)

కృ—(నివారించి) ఆఁ! ఆఁ! యుధిష్ఠిరమహారాజా! ఏమి యీపాపము!

అ—కృష్ణా! వాసుదేవ!

ఆ. జనకునంతఘనుని నజాతశాత్రవుని, జం
పఁగఁదలంచినాఁడ పాపమతిని,
ప్రతిన లేల? నింక బ్రదుకఁగఁజాల, ఖ
డ్గమునఁ జచ్చి సుఖముఁ గాంచువాఁడ.

(పొడుచుకొనఁ బోవును.)

కృ—(పట్టుకొని) ఆహాహా! ఏమి యీపాండవసోదరుల పరితాపము! ఆత్మవధోద్యోగమున నింతటివీరులు భూతవర్తమాన భవిష్యత్కాలములం గలుగరు!

అ—బావా! నన్ను వారింపకుము. ప్రతిజ్ఞాభంగమును నేనెట్లు సైరింతును! పూజ్యుఁడగుసోదరుని వధించుటకన్న నేనే ప్రాణముక్తిఁ గాంచెదను.

కృ—నీప్రతిన కిప్పుడేమియు భంగము గలుగలేదు.

అ—గాండీవ మొరులకిమ్మని పలికినవాని వధింతుననిగదా నాప్రతిన.

కృ—ఔను.

అ—అట్లుపలికినది నాయన్నగారు ఈయనను నేను వధించినం గదా నాప్రతిన నిలుచుట.

కృ—వెర్రివాఁడా! పరులను దూషించుట వధించుటయే యని యెఱుఁగవా? నీ వీ యుధిష్ఠిరుని దూషించుట వధించుటయే యగును కావున నీప్రతిజ్ఞ పరిపాలింపఁబడినది.

అ—ఐనను నామరణము తప్పదు.

కృ—మరల నేమిమునిగినది?

అర్జు—భ్రాతృవధం బాచరించిన ద్రోహి యాత్మవధంబున కర్హుఁడే కద!

కృష్ణు—ఎన్నఁడును లేని విపరీతవిధమున నేఁడు నిన్ను నీవు పొగడుకొంటివి. ఇంతకన్న నాత్మవధ మేమున్నది?

అర్జు—(కౌఁగలించుకొని) బావా! ప్రతిజ్ఞాభంగము గాకుండ మాయన్నదమ్ముల ప్రాణములను నిలిపితివి! నీఋణంబు దీర్చుకొను టెట్లు?

ధర్మ—ఇది మొదటిసారి కాదు; కృష్ణకరుణావిశేషముననే, పాండవులు సజీవులై మనుచుండిరి.

అర్జు—(ధర్మరాజుపాదములం బడి)

చ. సలిపితివాఁడ నీకు నపచార మచింతితతీవ్రబుద్ధినై,
కలుషములాడినాఁడ; నినుఁ గారులు ప్రేలితి బుద్ధిలేక నీ
యలమటనైన మానసమునందుఁ దలంపఁగ లేకపోతి నీ
ఖలమతికోపము గయిదికావవె సోదర దీనవత్సలా!!



ధర్మ—నాయనా! చిఱుతతనంబున నాడితివిగాని నీకు నాపై విరోధమేమి? లెమ్ము దుఃఖపడకుము. కర్ణవధాకర్ణనమునకై తొందరపడి నిన్ను నేననరానిమాటలంటిని. విశ్రాంతిదీర్చుకొనియే రణమున కరిగి కర్ణుని వధింతువుగాని సుఖాసీనుఁడవుగమ్ము.

అర్జు—అన్నయా! ఇఁక విశ్రాంతి దీర్చుకొను టెక్కడిది! ఈకోపము చల్లారకుండఁగనే బావతోనరిగి భండనంబున కర్ణునివధించి వచ్చెదను. తమయాశీర్వచనంబునకై వేచితి.

ధర్మ—విజయుఁడవై వచ్చెదవుగాక! నాయనా! పోయి రమ్ము. ముకుందా! పార్థునిచే నెట్లు రణమొనరింపఁజేసి మాటదక్కించెదవో!

కృ—నీధర్మమే మాకు రక్షాకవచము! పార్థా! రమ్ము

(అందఱు నిష్క్రమింతురు.)

షష్ఠాంకము

---



# దానవీరకర్ణ.

సప్తమాఙ్కము.

—:O:—

౧ వ దృశ్యము.

ప్రదేశము—యుద్ధభూమి.

[రథస్థులగు కర్ణశల్యులు ప్రవేశించుచున్నారు.]

శ—ఏమియును జ్ఞప్తికివచ్చుటలేదా ?

క—లేదు.

శ—జ్ఞప్తికిఁ దెచ్చుకొని చూడుము.

క—ప్రయత్నించి విసవు నందితిని.

శ—నిన్నటివఱకు భార్గవశరవిద్యోపదేశము స్మృతియందున్న దని చెప్పితివే ?

క—ఔను. నేఁడు రణమునఁ బ్రవేశించినతోడనే బుద్ధి మందగించినది. అన్నియు మఱపునకు వచ్చుచున్నవి.

శ—(వికటముగ నవ్వును.)

క—ఏటికి నవ్వెదవు ?. . .

శ—నీ తెలివిలేమికి నవ్వెదను. నీగర్వమానసమునకు నవ్వెదను. నీప్రాప్తికి నవ్వెదను. భూసురులశాపము పనిచేయుదని, నిన్న



గదా నాతోఁ జెప్పి బీరములుపలికితివి. భూసురశక్తి యిప్పుడైనఁ దలఁదట్టెనా ? ఇఁకను గర్వించెదవా ?

క—పోనిమ్ము. పరశురామాస్త్రములే వలయు నవసరమేమి ? పార్థప్రాణహరణంబునకు నాభుజశక్తి చాలును.

శ—ఇంకను నీకు భుజశక్తియా? కర్ణా! మదమణఁగలేదా? చచ్చిన పిదపగాని యణఁగదేమో !

ఆ. కవచకుండలములు దివిజాధిపతిఁ జేరె
వ్యర్థమయ్యె శక్తిబాణ మటుల
భార్గవాస్త్రవిద్య భంగంబునందె నీ
బాహుశౌర్య మెట్లు ఫలితమౌను.

క—శక్తిబాణము చనినఁ జనుగాక ! ఖాండవదహనకాలమున పార్థునిపైఁ బగఁబూని నాకడఁజేరిననాగాస్త్ర మేమయ్యె ననుకొంటివి ?

శ—ఆకిరీటియెడల నదిమాత్రము వ్యర్థముగాదను నిర్ణయమేమి ?

క—వ్యర్థమగునని యెట్లు చెప్పఁగలవు ?

శ—నీజీవితరహస్యమునుబట్టి—

క—శల్యుఁడా ! ఇఁక చాలును. ఇదివఱకే కలఁగియున్న నామదిని నీపోటుమాటలచేఁ జెదరఁ జేయకుము. బుద్ధిలేక నిన్ను నామిత్త్రుఁడు సారథిం జేసెను.

శ—పోనిమ్ము. నీప్రచారము నాకేల? ఈయొక్క మాట వినుము.

క—ఏది ?

శ—ఆదినము నేఁడేకదా !

క—ఏదినము ?

శ—అర్జునుఁడు నిన్ను సంహరించు దినము—

శ—దురాత్ముఁడా! నీప్రసంగము మానవుగా?

శ—ఆఁ! ఆఁ! దూషింపకుము—నేను నీవలె సూతుండను గాను—నీకన్న నుత్తముఁడగు క్షత్రియుఁడ—కన్నులఁ బోవును.

క—నా చావును నీ వెట్లు నిర్ణయించితివి.

శ—చూడుము. నేఁడు నీమనస్సే నీమరణము సమీపించిన దని సాక్ష్యమిచ్చుట లేదా? అదిగాక—మనము పటకుటీరము వెలువడుట తోడనే—వితంతు వెదురగుటఁ జూడవా? మనశిబిరరక్షకుఁడు వ్రణపట్టికల కసి నూనెముంతను మన కభిముఖముగఁ దెచ్చుట యశుభ మని నీవేల నిర్ణయింపవైతివి? రథమున నీవు కాలు మోపినంత నేనేను మరణసూచకంబుగ తుమ్మితినే! స్మృతికి రాలేదా? రథకేతనము చుట్టును గ్రద్దలు మూగెఁగదా! దానినైన గుఱుతింపవా?

క—నేనీదుర్నిమిత్తములకు భయపడెద ననుకొంటివా?

శ—అవును. సుయోధనుఁ డొసఁగిన సేనాధిపత్యముచే నొడలు మఱచిన నీకు దుర్నిమిత్తశంక యేల? ఈయుద్ధమున చావనైన జచ్చెదవు గాని—

క—చీవాట్లకు చింతకాయలు రాలునా? వెఱ్ఱివాఁడా! పలుమారులు నేను చత్తునని నీవు బెదరించిన నీపలుకులే వేదాక్షరములగుటకు నీవేమి వేదవ్యాసుఁడవా? చతుర్ముఖుఁడవా! నీయున్మాదము చాలించి రథమును సాగనిమ్ము.

శ—కానిమ్ము, నాకు నీమరణవిచారమేల? బంధుఁడవా! మిత్త్రుఁడవా? ఎందఱు భారతరణమున చావలేదు? అందఱికన్న నీయాధిక్యత యేమి? ఇదిగో! రథము దోలుచున్నాను.

క—చూడుము. అదిగో! కపిధ్వజము. అదిగో పాంచజన్యనాదము. అర్జునుని తేరు సమీపించినది. నీవు వడిగా నశ్వముల నదలింపుము.



[రథస్థులగు కృష్ణార్జునులు ప్రవేశింతురు.]

అ—కర్ణా! భారతయుద్ధ మారంభమై నేటికి పదునైదుదినములైనది. మనయుభయులలో నెవ్వరో యొకరుమరణించిన నింతకష్టము లేదు; సైనికులందఱు రణమున మిగుల నలసియున్నారు. రణోత్సాహము సేనలందుతగ్గినది. ఈపృథ్వి యకర్ణమో యపార్థమో శీఘ్రముగ నిర్ణయింపఁబడుటమంచిది. నేఁడాపని నిర్వహింతమా!

క—అభ్యంతర మేమి? అటులే కానిమ్ము.

శ—కృష్ణా! పార్థసారథివగు నీయంతవాఁడనై నేను కర్ణసారథి నైతిని.

కృ—నడుపవోయి నీశల్యసారథ్యము—కర్ణునిరథము, నడచినప్పుడు గదా నీవు నడుపఁగల్గుట?

శ—నడువక—దొంగయూబినిఁ బడుమహిషమువలె భూమిలో దిగఁబడుననుకొంటివా?

కృ—ఏమో ఏవేళ కేదిరానున్నదో!

అ—కర్ణా!

మ. కురుసేనల్ వెఱఁగంద భీముఁడు రణక్షోణిన్ గదామాత్రభీ
కరుఁడై నిన్ననె, దుస్ససేన ఘనవక్షస్థానముం జీల్చి మే
దురరక్తంబును ద్రావి; వానిశపథస్తోమం బరందీర్చె నీ
శిరముం ద్రుంచిమదీయమౌ, శపథముం జెల్లింపఁగా నొప్పదే?

క—ఓరీ! వాచాలా! ఈశపదములకేమిలే?

గీ. దుస్ససేనునిఁ జంపి నెత్తురులు ద్రావ
గదను రారాజు నూరుభగ్నంబు సేయ,
మీరు ప్రతినలు దాల్చిన తీరుగాఁగఁ
గలవుమాకుఁ బ్రతిజ్ఞలు; గర్వమేల?

శ. కర్ణా! మీరే, వంటయింట నీప్రతినలు దాల్చితిరి? ఎన్నఁడును మీప్రతినలను విని యుండమే?

కృ—నీప్రతినలతో మాకు నిమిత్తము లేదు ప్రతిజ్ఞాపరిపూర్తి క్రియలతోఁగాని, మాటలతోఁగాదు.

క—అట్లయిన శరచాపములు సిద్ధముగనున్నవి

కృ—అర్జునా ! గాండీవమెక్కుపెట్టుము. ఎవరికో యొకరికి నేడు విజయప్రాప్తి కలుగవలయును.

(కర్ణార్జునులు యుద్ధము జేయుదురు.)

శ—కర్ణా ! అర్జునప్రతాపము రక్షకుండవగు నీకేకాక, సారథినగు నాకును చవి జూపుచున్నది. నాటిప్రతాపవాక్యములు, శస్త్రవిద్యతో పాటు మఱపువచ్చెనా ?

క—ఛీ ! ఛీ ! దుష్టుఁడా ! నీమూలముననే నాకింతచేటు గల్గుచున్నది. మారాడక నోగలపై నుండుము. తొలఁగినఁ దొలఁగుము. సారథ్యమునుసయితము నేనెఱుఁగకపోలేదు.

శ—అయ్యయ్యో! నీకంత కష్టమేల ? సారథ్యమునకు నేనుంటినిగాదా? రథమున కేదైన నపాయముగలిగినచో నీసహాయము గాని రథము తిన్నఁగా నున్నంతవఱకు సారథ్యశ్రమను నాయందే యుండనిమ్ము.

క—ఎటులో కానిమ్ము. పార్థా! చూచితివా యీనాగాస్త్రమును ! ఖాండవవనమును నీవు దహించినప్పటి నాగకుమారుఁడీతఁడు. నీపైఁ బగఁబూని నన్నుఁజేరెను. దీనినుండి నేఁడు నీవుతప్పించుకొనలేవు.

శ—అర్జునా ! వింటివా కర్ణుని బెదరింపులు. నీగుండె దడదడలాడుటలేదుగదా ! పుట్టినప్పుడే నిన్ను చంపవలయునని కవచకుండలములతోఁ బుట్టెను: నిన్ను చంపవలయుననియే పరశురామునికడ దొంగవేషమున విద్య నభ్యసించెను. నీమరణముకొఱకే యింద్రునికడ శక్తిని సంపాదించెను. ఈనాగాస్త్రము సయితము నీకొఱకే సంపాదించినాఁడు. పాప మిప్పుడీతని కిన్నిటిలో నిలచిన దీశస్త్రమొక్కటియే. కావుననే యీనాగాస్త్రమునం దీతనికి ప్రేమయధికము.



క—ఓరిపయోముఖవిషకుంభమా ! నాప్రారబ్ధమున కేమందును ? ప్రతికూలదైవమిట్టి దుర్మార్గుని నిన్ను నాకు సారథిగ నియమించెను. కర్ణశూలాయమానములగు నీమాటలకెంత శాంతి దాల్తమన్నను హృదయావేగము చల్లఁబడుట లేదు.

శ—ఆడలేక మద్దెలయోడ ననుటులున్నది. ఓరిశూరమ్మన్యా! ఎందులకీవీరత్వోద్ఘాటనము ! నిజముగ నీవు పార్థుని గెలువఁగలవనియే గర్వించుచుంటివా ! పార్థునేమి నీవేమి గెలుచుటేమి ! హే హే హే

క—సూతమాతృండవగు నీకేమి? ఇంత మిడిసిపాటేమి !

శ—సూతుఁడవు నీవానేనా? మతిమఱచి మాటలాడుచుంటివా కర్ణా! మతితప్పుకాలమారంభమయ్యెనా! నేను సూతుండనగు కర్మమేమి ? నీకును నీరాజునకు సారథికిగతిలేక మూర్ధాభిషిక్తుఁడనగు నేను దయఁదలఁచివచ్చితిని. ఒడలు తెలిసికొనుము.

క—ఛీ కల్మషమతీ! నీతో వివాదమేల ! (శరముతొడుగుచు) అర్జునా ! కాచుకొనుము. ఇదె నాగాస్త్రము.

కృ—పార్థా ! త్వరపడు. త్వరపడు. శిరంబు గుఱినిదప్పించి క్రిందికి వంచుము.

అ—ఏల !

కృ—కారణ మడుగకుము. త్వరపడుము. ఇప్పుడువంచవలదు. శరము చాపవిముక్తముకానిమ్ము.

(కర్ణుఁడు నాగాస్త్రమువిడువగా కృష్ణార్జునులు తలలువంతురు నాగాస్త్రము గుఱి దప్పును. అర్జునుని కిరీటము భూమిదొరలును.)

శ—భళి భళీ కర్ణునిగురి ! కంఠమునకుఁ గొట్టుటకుమారు కిరీటమునకుఁ గొట్టితివేమి ! నాగశరంబుసైతము నిష్ఫలంబైనటులేకదా ! ఇంకేమాశవహింతువు ! అర్జునుని పాదములంబడుము.

క—ఛీ! దుర్మతీ! నోరుమూయుము. పార్థునిపాదముల నేను బడవలయునా! పార్థునిశిరము నాపాదములఁబడనున్నది. చూఁడు! నా నాగాస్త్రము మరల నెట్లువచ్చుచున్నదో!

కృ—ధనంజయా! ప్రమాదము సంభవింపనున్నది. నాగాస్త్రము మరలవచ్చుచున్నది. దీని నారునాగసంబు లేసివధింపుము.

(అర్జునుఁడు నాగాస్త్రమునుద్రుంచును.)

శ—కర్ణా! ఇప్పుడుచూచితివా! ఎవరిశిరంబు నేలదొరలినదో! నాగాస్త్రమేమైనది?

క—పార్థా! నాసర్వశక్తులు నిప్పుడు సమసినవి. నిస్సహాయుఁడనై యుంటిని. నీవు సర్వసాధన సంపత్తిగలవాఁడవు. ఐనను, నా జన్మమున కధైర్యములేదు.

గీ. అనలశిఖలట్లుశాపము లాక్రమించి,
కుంచితునిఁజేసి, నిన్ను మాయించె, నైన
సమదరిపు దారుణాంబు మత్సౌర్యకలన,
నిన్నువిడువదు ప్రాణంబు చన్నదనుక.

శ—కర్ణా! బీరంబు లేమిపలికెదవు? ఇటుచూఁడు. రథము కదలుటలేదు.

క—ఎందుచేత?

శ—రథచక్రము భూమిలోఁగ్రుంగినది!

క—(రథముదిగి) ఔరా! ఇదియునుసంభవించెనా! ఒక్క శాపమైన నన్ను విడువలేదుసుమా శల్యా!

శ—ఇదేమిశాపము?

క—ఒకనాఁడొక విప్రాంగనమ్మాలమున, నేతికొఱకై . . . . .

శ—ఓహో? అప్పుడు భూదేవి ప్రసాదించిన శాపమా!

క—ఔను. ఐనను నాశక్తికొలఁది చక్రము నెత్తెదను. నీవును రథావతరణము చేయుము.



శ—(దిగును.)

క—(చక్రము నెత్తుచు) ఔరా! ఏమిచిత్రము! రథచక్రము నెత్తినకొలఁదియు మరింతగ్రుంగుచున్నది. భూతలము, కులపర్వత కానన సముద్రసహితంబుగ నారంగుళంబులు పైకెగసినది! కటకటా! పరశురామ భార్గవాస్త్రంబా, ప్రతిభాసింపదయ్యె. జామదగ్న్యభూసుర భూదేవీ శాపంబులా, సమయమునకుఁ బనిసేయఁజొచ్చినవి. సర్పముఖ శరంబా గురిదప్పెను. కటకటా!

గీ. ధర్మవాదులు ధర్మతత్త్వప్రధాన
చిత్తులగువారిఁ బూని రక్షించుధర్మ
మందురదిబొంకుగావించె నతులధర్మ
శీలుననుధర్మమిపుడు రక్షింపదయ్యె.

అ—కర్ణా! ఎంతసేపు కాలయాపనము! రథమధిరోహింపుము రణముసలుపుము. మేమింక శాంతింపఁజాలము.

క—శల్యా! కొంచెము చక్రము లేచినది. ఇఁక రథమెక్కుము.

(ఇద్దరును రథమెక్కుదురు)

క—అర్జునా! ఇదె బ్రహ్మాస్త్రము. చూడు. (విడచును)

అ—ఇదె నా యైంద్రాస్త్రము విడిచితిని.

క—నీయైంద్రాస్త్రమును నాబ్రహ్మాస్త్రమే గెలిచినది. ఇప్పుడేమి చెప్పెదవు?

కృ—పార్థా! బ్రహ్మాస్త్రమునకు బ్రహ్మాస్త్రమే వదలవలయునని యెఱుంగవా?

అ—అవును. కర్ణా! ఇదిగో బ్రహ్మాస్త్రము చూడుము నీ బ్రహ్మాస్త్రమును వారించినది.

శ—కర్ణా! తిరిగిరథచక్రము నేఁగ్రుంగినది. (ఇరువురు దిగుదురు)

క—నాశరీరమున రక్తము విశేషముగఁగారుచున్నది. అయి
నను భయములేదు. శల్యా! ఈదక్షిణభుజబలంబున చక్రంబు నెత్తె
దను. చూడుము (ఎత్తును)

కృ—పార్థా! కాలాతీతమగుచున్నది. రథచక్రము నేలఁగ్రుం
గిన కర్ణుఁడింకమనతోఁ బోరులేమి గెలుచులేమి? ఇదేసమయము
ఈదురాత్ముని భూమింగూలనేయుము.

అ—అయ్యో! శరముదాల్పనివాఁడుగదా!

కృ—ఏలసందేహము! రణమెల్ల ధర్మముననే జరిగెనా? ఈ
ధర్మసందేహముల కేమిలెమ్ము. దుస్సాధ్యశత్రువుఁడు చేఁజిక్కినప్పుడు
ధర్మసూక్ష్మమునకు అలేదు.

క—ఆఁ! ఆఁ! తప్పునుమాయిది. కృష్ణా! మీరురథస్థులు
నేను భూమిస్థుఁడ. ఇంతవరకు సమయుద్ధచతురులనిపేరుగంటిరి. నేఁడీ
యధర్మకార్యమువలన గలుగు దుష్కీర్తి కలకాలము నిలువఁగలదు.
శాపపీడితుఁడనై రథచక్రము భూమిఁ గ్రుంగు నీదుష్కాలమున సధ
ర్ముఁడగు పార్థునిఁ బ్రోత్సహించి నన్నుఁజంపఁ బాపపుబుద్ధిఁ దోలుట
నీకుఁ దగదు. ధర్మాధర్మ విచారణసేయుము. అసమర్థుఁడనుగాను.
చక్రమును సరిఁజేసికొననిమ్ము, పిదపమనమనసామర్థ్యంబులు దెలియ
వచ్చును.

కృ—ఆఁ! ఏమి? కర్ణా! ధర్మాధర్మవిచారమా! నీనాలుక
కింకను ధర్మమునుమాట నాడుట కధికారముగలదా?

సీ. గొంతియు నందఱు కొడుకులు సుప్తులై
యుండంగ లక్కయిల్ మండఁజేసి
కపటంపుజూదంబు ఘటియించిధర్మాత్ముఁ
డగుధర్మసుతుసిరియపహరించి
యంతఁబోవక ద్రుపదాత్మజఁ దెచ్చి స
భాస్థలి నమ్మెయి భంగపఱచి



యమ్మహాత్ములఁ జంప నడవికిఘోషయా
త్రానిధినెపమున దాడివెట్టి
గీ. బాలునభిమన్యు నొక్కని బహురథికుల
బనిచిచంపించె మీసుయోధనుఁడు దలఁపఁ
గానియిప్పాపముల కాదికర్తవీవ
యిన్నియెడలను నీపాడియెందుఁబోయె.

పార్థా! నీవాలసింపకుము. కౌరవులు మనయెడల గావించినయన్యా
యములందిదియెన్నవపాలు! చంపవలయు— ఈతరుణమందే—ఈపాపి
కర్ణునిఁ జంపవలయు.

క—(కోపముతో) ఓరీ! కపటదామోదరా! నీమూలము
ననే మాకింతచేటుగలిగెను. ముప్పుకుఁడవగు నీవు కురుపాండవుల
నడుమ నీకలహంబులు పెంపకున్న నీసంగ్రామమునకుఁ గారణమే
లేకుండునుగదా! విషోదరుండవై యెన్నెన్నియధర్మకార్యములను
పాపమనూయికులగు పాండురాజనందనులచేఁ జేయించితివి? లజ్జాభి
మానవర్జితుండవై మరలధర్మముమాట నెత్తనేల? నీతల నామాట
లకు నేలఁబడుటలేదా? కుటిలబుద్ధిచే చక్రింబుదాల్పనని తొలుతఁ
బ్రతినఁబూని భీష్మునిఁ జంపయత్నించితివి. స్వేచ్ఛామరణంబుఁగల
భీష్ముని శిఖండికారణమున నంపశయ్యాగతుఁడఁ జేసితివి. బొంకనుమాట
యెఱుఁగని ధర్మజుని మోసగించి యశ్వత్థామ చచ్చెనని యనృతము
లాడించి ద్రోణునిదూలించితివి. విదురునింట విందుగుడిచి సంధిచెడఁ
గొట్టితివి. పార్థుని రణమునుండి దూరముగ గొనిపోయి యభిమన్యుని
నీవచంపించితివి. ప్రొద్దు గ్రుంకెనని యనృతమాడి సైంధవుని జంపిం
చితివి. ఇప్పుడు రథచక్రము నేలగ్రుంగి నిరాయుధుఁడనై సంగరమునకు
దొలఁగిననన్నుధర్మమునఁగఁ జంపింపదలఁచితివి. ఛీ ఛీ? కపటశీలా! ఇంత
మాత్రమునసీవు పరాక్రమశాలివైతివటరా! పాయుబోతా! జరాసం
ధునిచే నెన్నిమారులు పరాజితుఁడవై పాఱిపోయితివో మఱిలేదా!

పుట్టిన దాదివిష్ణులీలలను పేర గొల్లపడుచుల చేబట్టుచు వారియిండ్లలో ని
పాలువెన్నలను మెసవుచు దుర్గుణంబులే పరిధానంబులుగ బ్రతికితివి.
ఛీ నీపేరు దలంపఁగూడదు. నీతోడ నేమి? పార్థా! నీవు ధర్మశాలివి.
క్షణకాలము శాంతింపుము.

అ — శాంతించుటకు వీలులేదు. నేలనుండియే బాణము వద
లుము. నిన్నుఁ జంపుటకు నాశరంబు లాందోళనపడుచున్నవి.

(అశ్వత్థామ ప్రవేశించును.)

అశ్వ — కర్ణా! పాపము. భూసురశాపంబులు నిన్ను నేఁడు
శౌర్యవిహీనునిగఁ జేసెనా? కాలమహిమ — కురురాజు నిన్నెంతగా
నమ్మియుండెనో యంతయు నాశాభంగముఁ గలిగినది. పోనిమ్మిపుడు
గతముఁ దలంపవలదు. నాహితము వినుము.

ఆ. కురుకులేశ్వరునకుఁ గూర్చెదువా రెవ
రైన సరియె, నిట్టి యదనునందు
నోపినంత శక్తిఁ జూపింపవలయు, స
హాయ మాదు నీకు నాలమందు.

క — ఛీ! నీసహాయమా నేను గోరునది? ఎన్నఁడులేని బ్రా
హ్మణసహాయము నిప్పుడపేక్షింతునని వచ్చితివా! నీవు రక్షించి
ప్రాణముఁ గాపాడితివన్న గోడు నాకేమి?

అశ్వ — ఆఁ! నాగోడే నీకక్కఱలేదఁటరా! ఓరి బ్రాహ్మ
ద్వేషీ! ఇట్టి స్వాహంభావమువలననే కదా నీవీదుర్గతికిఁ బాల్పడి
తివి. అంగరాజ్యమిచ్చిన కురురాజునకు నీవేహితంబు సల్పితివి?
దుశ్శాసనుని భీముఁడు ఱొమ్ము చీల్చి రక్తముఁ ద్రావుచుండ, దగ్గఱ
నుండి యూరక చూచుచుండిన యసమర్థుఁడవు కావా నీవు? నా
సహాయమును నిరాకరించితివి. నిన్నీపార్థుఁడు నేఁడు బ్రదుకనిచ్చునా?

క — చచ్చివనర్జునుని చేతఁ జత్తునుగాని నీసహాయమపేక్షింపను.

అశ్వ — తథాస్తు. (నిష్క్రమించును.)



కృ — పార్థా! ఈకర్ణుని సంహరింపుము. ఎంతతడవీ కాల
యాపనము?

క — కృష్ణా! మహాద్రోహమునకు నీవు పాల్పడుచుంటివి. ఈకలు
షము నీవంశాంతమొనరించునని నమ్ముము, నీయధర్మమునకు నా
యాత్మ మహాసంక్షోభము నొందుచున్నది. నాయుసురు నీకుఁ దగు
లకపోదు. అర్జునుఁడు నన్ను చంప వెనుకంజవేయుచున్నవాఁడు. నీ
దుర్బోధన మాతని మనస్సును విఱుచుచున్నది. (చక్రము నెత్తుచు)
ఇదిగో చక్రము లేచినది. క్షణకాలము శాంతింపుము. పార్థుని గూపు
మాపెదను.

కృ — చాలు చాలు. నీయుపన్యాసము. నేనధర్మకార్యములు
చేయించి మిమ్ము హతమార్చితినని దూషించితివా? ధర్మాత్ములయిన
కతమున యుధిష్ఠిరాదులు జయించి రాజ్యరమాలాలితులై ధరిత్రిఁ
బరిపాలింతురు. అధర్మనిరతులైనందున — కౌరవులు నశింతురు. ఇందు
నాకపటమేమున్నది. ఇదియంతయు మీస్వయంకృతాపరాధము.

క — ఆఁ! దుర్యోధనాదు లధర్మనిరతులను వాక్యపిశాచమిం
కను నిన్ను వదలదయ్యెఁగా! ఓరి కపటతంత్రవిశారదా! కౌరవ
పాండవులందెవ్వఱు ధర్మాత్ములు?

కృ — నీకింకను సందేహమా! భూజనంబుల నడిగి చూడుము
యుధిష్ఠిరాదులు ధర్మవాదులని యెట్లువాదింపగలరో!

క — నీవంటి దుష్టమానసు లందందు జేరి కౌరవులు దుష్టులని
చాటుటచే నమాయికులగు లోకులట్లు తలంచిరి. కానిచో నేతిబీరకా
యయందెంత నేయిఁ గలదో ధర్మజునందంత ధర్మముగలదు. ఎక్కడిదా
ధర్మము? అసలెవ్వఁడీ ధర్మరాజు? రాజ్యభాగంబునకై తగవులాడ నీత
నికేమధికారము?

కృ — ఆఁ! ఏమీ దుర్వాదము.

క—మర్యాదనా! దుష్టగోపాలకా! ఇంకెంతకాలము నీమాటలచే లోకముం గట్టెదవు? నిరాధారమగు నీ దాయభాగవివాదముం దెచ్చిపెట్టినది నీవుగాదా! ఇఁక నిస్సహాయుండనగు నన్నెట్లును నీవు బ్రతుకనీయవు. చావనున్నాను. నాక్రోధము వెళ్లఁగ్రక్కియే చచ్చెదను.

కృ—దాయభాగవివాదము నిరాధారమా?

క—కాదా? విస్సన్న చెప్పినది వేదమన్నట్లు నీవీన్యాయమును ప్రపంచమున వ్యాపింపఁజేసితివి.

కృ—సత్యహితమునైన సత్యపాతివ్రత్యంబున నక్రమభాషణంబు లాడకుము.

క—ఆవేదనా! నీనోటనామాటలుసత్యములని యొప్పించెదనా

కృ—ఎట్లు?

క—ఎట్లా! కురువంశంబున నుదయించిన రాజ్యాధికారిధృతరాష్ట్రుఁడు. రాజ్యముధృతరాష్ట్రునిదిగాని పాండురాజుదిగాదు. ఒకవేళపాండురాజున కర్ధరాజ్యముగ వలయుననుకొన్నను వైద్యశాస్త్రము ననుసరించి పాండురోగికి రాజ్యాధికారము లేదే! అటులే పాండురోగి కుమారులకును లేదు. అదిగాక పాండురాజెవ్వఁడు? పాండవులెవ్వరు? కురురాజ్య మెక్కడపాలికిరావలయు! రంకులాడియగు కుంతియముని కొకని గాలికొకని ఇంద్రునకొకని గన్నంతనే యాకులటాసుతులకు కురుకులంబునబుట్టినివారికి రాజ్యమీయ వలయునా? కృష్ణా! మరియొకమాట రాజనీతివేత్తయగు దుర్యోధనుఁడు, పదుమూఁడేండ్లుపాండవులను ప్రవాసవాసులంజేసెను. పదమూఁడేండ్లు దాటినపిదప నేభూమిపైన నెవ్వరికైన నధికారముండునా? కాలదోషము గలుగదా! పదునాల్గవయేట కాలదోషముబట్టిన రాజ్యము నడిగి పాండవులు తగవునకువచ్చుట కేవల మధర్మముకాదా? తగుదుననిరాయ



బారముసలుపవచ్చిన నీవా ధర్మవేత్తవు? ప్రపంచజ్ఞానములేని భూస్వామి నడిగి చూడు. ఇది యన్యాయమని పలుకును. పెద్దవాఁడగు ధృతరాష్ట్రుఁడు బ్రదికియుండఁగా నాతనికుమారులు రాజ్యమేలఁదగరఁట! అధర్మవాదులఁట—ఎవరికో కుంతిఁగన్న యనామకులు—పేరునకు తండ్రియై చచ్చిన పాండురాజపుత్త్రులకు దాయభాగమఁట! వెఱ్ఱిగొల్లఁడవగు నీకు రాజకీయ మేమి తెలియును? ఛీ! ఛీ!—నీవు గదా యీకల్లోలమునకు హేతువు?

కృ—అర్జునా! వీని ప్రేలాపనము నీశరములచేతనే కాని నామాటలచేఁ దీరదు. త్వరపడుము.

క—రథచక్రము తిరిగి క్రుంగినది. ఉండుము. చక్రమునుసరి జేసి నేనును రథము నెక్కెదను.

కృ—కాలవిళంబమునకు వీలులేదు. పార్థా! చూచెదవేమి?

అ—ఇదిగో! బాణమును వదలుచున్నాను. (విడచును.)

క—ఛీ! అధర్మనిరతులారా! మీరు మర్యాద నతిక్రమించి ప్రవర్తించుచున్నారు. ఇఁక నయభాషణముల కెడములేదు.రథమును విడిచితిని. భూతలముననే యుద్ధము చేయుదును.

(కర్ణార్జునులు యుద్ధముచేయఁగా కర్ణుఁడు భూమిపై బడును. తెరవాలును.)

---

౨వ దృశ్యము.

(కృష్ణార్జునులు ప్రవేశించుచున్నారు.)

అ—కృష్ణా! నీకీవిచారమేల?

కృ—కర్ణుని పలుకులే కారణము.

అ—ఏమి నీనిర్హేతుకవిషాదము! దుష్టుఁడగు నాతని ప్రేలాపనములకు నీవిట్లు చింతిలనేల?

కృ—పార్థా! తప్పు—తప్పు—కర్ణుఁడు దుష్టుఁడని పలుకవలదు. ఆతఁడు మరణకాలమున నాడినమాటలన్నియును వేదాక్షరములని నమ్ముము—ఆతఁ డాత్మగౌరవమును బోషించుకొనినమహాత్ముఁడు—మనబోటు లాధర్మాత్మునిముందు నిలువఁజాలము.

అ—అటులాడెద వేమి?

కృ—నిజమే పలికితిని. నన్నాతఁ డాడినమాటలకు తలయెత్తనేరక సమయానుకూలధైర్యముం జూపితిని,

అ—అంత ధర్మాత్ముఁడని నీవు పలికితివి. అట్టివానిని ధర్మదేవత యేల రక్షింపఁదయ్యెను.

కృ—ధర్మమా! రక్షింపకుండుటకు మనశౌర్యము కారణము గాదు, కర్ణుఁడు పాపము పలుశాపంబులచే నశించెను.

క. "నరవర! నీచే నాచే
వర మడిగిన కుంతిచేత వాసవుచేతన్
ధరచేత శల్యుచేతను
నరయఁగ కర్ణుండు నీల్గె నార్వురిచేతన్."

ఇవిగాక పరశురామశాపం బొక్కటి బలవత్తరంబై పీనిని వెంటాడించె.

అ—కానిచో కర్ణుఁ డంతధర్మశీలుఁడా!

కృ—నీకు నిదర్శనము చూపవలయునా?

అ—చూడఁ గుతూహలముగ నున్నది.

కృ—కర్ణునిప్రాణము లింకను బోలేదు. మనము సాధురూపములఁ దాల్చి మఱల నొక్కమాఱు రణభూమి కరుగుదము రమ్ము.

అ—చిత్తము. (నిష్క్రమింతురు.)



# మోక్షరంగము.

—:0:—

(శరబాధచే దొరలుకర్ణుఁడు ప్రవేశించును.)

క—(బాధ నభినయించుచు) ఆనందమునకు సంతృప్తియే యవధి. తృప్తియే మానవజీవితనిక్షేపము. కావున డెందమా! తృప్తి వహింపుము. ఇంతే. ఇఁక నీజీవితమునకింతే. గెలిచెను. అన్యాయమో న్యాయమో నాప్రతిస్పర్ధి పార్థుఁడే గెలిచెను. కీర్తికాంతచే నేనును గెలిచితిని. కవచకుండలదానంబున నింద్రునిసయితము మెప్పించితిని. దానకర్ణుండనుకీర్తి వహించితిని. పాండవుల కేమిగలదు? కలకాల మీయన్యాయంబును భవిష్యజ్జనులువాకొందురు........ఓహో! సంధ్యాకాలము గాకున్నది. సంధ్యవేళగాని నాకు మరణములేదుగాఁబోలును. తండ్రీ! సూర్యభగవాన్మూర్తీ! నీతనయునిమరణంబునకై నీ వెంతశీఘ్రముగ నస్తమించిన నంతమేలగును. శరబాధ భరింప నశక్యముగనున్నది........ ఔరా! పట్టపగలే జంబూకములు దరికివచ్చుచున్నవి, శవప్రాయుఁడనై పడియున్ననన్నాహరించుటకా! ఓసంగ్రామ సంచారభూతభేతాళసంతానములారా! మీరైనదయఁదలఁచి నాజీవితశేషముం దీర్చివేయుఁడు శరీరబాధతోపాటు మానసబాధయు దుర్భరముగనున్నది. ఓమిత్రమా! సుయోధన! నన్నుచిన్నతనమాదిగనతిసౌహార్ద్రంబునఁజూచి మన్నించితివి. నాకై యెందరెందరితోడనో విరోధముఁబూనితివి. నీఋణముఁ దీర్చుకొననైతినిగదా యను విచారము నాహృదయమును గలఁచుచున్నది. నీవాల్లభ్యమెల్లనాయెడల బూడిదెలోఁ బోసినపన్నీటిచందమునయ్యెను. పరశురామాదులకిప్పటికిఁ గడుపుమంట చల్లారెనా! ఔరా! ఒక్కండనగు నాకొఱకెందరు శ్రమపడిరి. కృష్ణపార్థులునయిత మెంత యధర్మము

నకుఁబొల్పడిరి. ఛీ పవిత్రముగనుండదగిన యీచరమసమయమున నేనిప్పుడీ చింతలకు మానసమున నెడమీయఁజనదు. ఎవరావచ్చునది?

[కుంతి విచారముతో ప్రవేశించును.]

కుంతి—నాయనా! కర్ణా! నాతండ్రీ! (ఆక్రందించును)

క—తల్లీ! కుంతీదేవివా!

కుం—నిన్నీయవస్థలోఁ జూచెదననుకొనలేదు. నాయనా, నీకెంతపాటుగలిగెను?

అన్నదమ్ములకలహములెంత దెచ్చెను! నాకడుపుశోకము తీరుటెట్లు? పుట్టినయందరు చల్లగానుందురని సంబరపడితినిగాని పెద్దకొడుకే నాకడుపుకొల్పుననుకొననైతినిరా!

క—అమ్మా! శాంతింపుము. నీకింక దుఃఖకారణములేదు. నీసంకల్పమే నెరవేరెను. నీకుమారుఁడు పార్థుఁడేగెలిచెను. అతనితో నీకు పంచపాండవులు పూర్ణమైరి. నేనే మరణించుచుంటిని. నీకు విచారమేల?

కుం—అయ్యో! నీవుమాత్రము గావా నాకుమారుఁడవు?

క—నీమానసమున నట్టితలంపుగలదా! కలిగినచో చిన్ననాఁడే గంగ కర్పింపనేల? ఇంద్రునిప్రోత్సహించి నాకవచకుండలములు హరింపఁజేయనేల? పార్థునిదక్క నన్యపాండుపుత్రుల నెవ్వరిఁ జంపనని నాచే బాస చేయించుకొననేల? నీకుటిలబుద్ధి నెంతయో వెల్లడించుకొంటివి. నీవేలేనిచో నాకీప్రాప్తమేలగలుగును? మీరందరేకమై నన్నన్యాయముగఁ జంపించితిరి. కానిండు. మీకురాగలకీర్తియు, నాకురాగలయపకీర్తియు లోకమే నామరణానంతరమున నిర్ణయించును. పొమ్ము, పొమ్ము. నాకైనీవు విచారింపకుము. నాచరమసమయము సమీపించినది. నిశ్చింతతో నన్నుజావనిమ్ము.



కుం—ఎటులైన నీవునాపుత్రుఁడవేకదా! మీయందరిమెదుట నాప్రాణములు వెడలిపోవుననియు నామరణకాలమున ధర్మజుచేఁ జెప్పించి నీచే తిలోదకంబులువదలించుకొనవలయుననియునాశపడితిని. అది శశవిషాణమయ్యెను. నీవే నాకన్నముందుగఁ దరలనుంటివి. ఇట్టి నీకు తల్లినగు నేనేమిచేయుదును?

క—అట్టివాత్సల్యము నిజముగ నీకుఁ గలదేని ధర్మజునిచే నాకు తిలోదకంబులిప్పింపుము. నాకునువ్వులునీళ్ళు విడువఁదగిన యొక్కకుమారుని వృషసేనునిసైతము మర్జునుఁడే తనపొట్టనుఁ బెట్టుకొనియెగదా!

కుం—నాయనా నాకునీవిది వేరుగచెప్పవలయునా? సుక్షత్రియ పుత్రుఁడవు. నాకారణముననిట్టి నీచతనీజన్మంబునకు గలిగెను తిలోదకములకై ప్రార్థింపవలెనా?

క—మరియొకమాట! నాజన్మరహస్యమునుగురించినీవువిచారింపవలదు. నామరణాంతము దనుక నీరహస్యమును వెల్లడింపవలదు నీకిదే నమస్కారము నాతప్పులను మన్నింపుము. అదిగో ఎవరోయిద్దరీవంకకు వచ్చుచున్నారు. మనసంభాషణము నొరులు వినఁదగదు. నీవు శీఘ్రముగనరుగుము.

కుం—హా! తండ్రీ! నీప్రాణములు పోవునంతకుఁ గనిపెట్టుకొని యుందమనుకొంటినిరా నాయనా! (దుఃఖించుచు నిష్క్రమించును)

క—ఔరా! మాతృప్రేమయందలి తీపి! ఛీ! ప్రకృతీ! నిన్నేమందును? ఇట్టిసమయమున సయితము నన్ను మమకారమున బడవేసెదహా?.........ఎక్కడి తల్లి—ఎక్కడి కుమారుఁడు—ప్రపంచమంతయు స్వప్రయోజనధురంధరముగదా? కుంతియా నామాత! నాపాలిఁటి యమదూత!—ఛీ! ఇది తగదు నాకు? ఈతలంపులే వలదు. పరాత్పరా! నాప్రాణము లిఁక నేల శరీరమును వీడకున్నవి? ఓతండ్రీ! భానుమూర్తీ! ఆసన్నాస్తశైలుఁడవగునీవు నన్ను

నుకరించి రక్తశరీరుఁడవగుచున్నావు. శీఘ్రముగ నస్తమించి నన్ను ప్రాణముక్తునిఁ జేయుము—నీ కిదే నమస్కారము.

(కన్నులు మూయును.)

(కృష్ణార్జునులు సాధురూపములతో ప్రవేశింతురు.)

కృ—పార్థా! కర్ణునిప్రాణములు సంధ్యాకాలముదనుకఁ బోఁజాలవు! అదిగో చూడు—భగవచ్చింతాపరవశుఁడై యున్నటులున్నది. నే నాతనిం బరీక్షింతును. నీవు చూచుచుండుము.

అ—అటులే కానిమ్ము.

కృ—దానవీరకర్ణరాజేంద్రా! దానము—దానము!—అర్థులము.

క—(కన్నులఁ దెఱచి) ఆహా! కృతార్థుఁడ! కృతార్థుఁడ! ఎవ్వ రీయర్థులు?—మరణకాలముననయితము నాకు వితరణ సుకృతంబు గలుగనున్నదా? అయ్యా! మీ రెవ్వరు?

కృ—రాధానందన! భోగసంక్రందన!

గీ. దానశీలుఁ డవని నిన్ను ధరణి జనులు
పొగడుచుండఁగ వింటి మద్భుతముగాఁగ
స్వర్ణదానంబునకుఁ గేలు సాచినాము
లేద నెడుమాట నీనోట లేదు గాన.

క—ఔరా! పరీక్ష!—మహాత్ములారా! మీరు నన్ను పరీక్షింపనేతెంచిన హరిహరులని తోచుచున్నది; గాని సామాన్యులని తలంపను. రణరంగమున శత్రువులచే వధింపఁబడి గతిలేని స్థితిలో రక్తపంకిలప్రదేశమున దొరలుచుంటిని. ఇప్పుడు మీరు స్వర్ణదానము నడిగితిరి. భయము లేదు. నానోట నింతవఱకు లేదనుమాట లేదు. నాదంతములం దొకటి సువర్ణదంతముగలదు. అంతకన్న నిప్పుడు—నాకడ గలసువర్ణ మేమియును లేదు. ఈదంతము నిచ్చెదను. స్వీకరించి



తృప్తులై నన్నుఁ గృతార్థునిఁ జేయుఁడు.

(దంతములాగియిచ్చును)

కృ—ఛీ ఛీ ఎంతహీనతకుఁ బాల్పడితివి?

క—మహాత్మా! నాయపరాధమేమి?

కృ—బ్రాహ్మణునకు శూద్రోచ్ఛిష్టదానముఁ జేసెదవా. దుర్మతీ!

క—సాధుపుంగవులారా! మరణాసన్నుఁడను. క్షమింపుఁడు. ఈసువర్ణమును పాతాళగంగాజలంబులచే పరిశుభ్రముగావించియొసంగెదను. శాంతింపుఁడు.

(ప్రయాసమున శరచాపములుగొని భూమింగొట్టగా పాతాళగంగాజల ముద్భవింపఁగా కడిగియిచ్చును.)

క—పూజ్యులారా! సాధుపుంగవులారా! ఇదిగో సువర్ణదానము. కృతార్థుఁడనైతిని. మరణకాలమున భూసురదానముంజేసికొని పరితృప్తుఁడనైతిని, ధన్యుఁడ!—ధన్యుఁడ!!—ధన్యుఁడ!!!

కృ—అ—(వేషములఁ దీసివేయుదురు.)

కృ—పరమపూజ్యుఁడవగుకర్ణా! చతుర్దశభువనంబులందును నీవు పుణ్యాత్ముఁడవు. నీదాతృత్వము మెప్పుకలిగించెను. నీప్రతిస్పర్ధియగునర్జునుఁ డిదే చూడుము. నీదానగుణంబుఁ బరిశీలింపఁ దలంచినాఁడు. అందులకై నిన్నీపరీక్ష చేసితిని. పరీక్షయే కాదు. మహానుభావా! నిన్ను సంహరించుటకు మా కెవ్వరకును శక్తిచాలకయే నిన్ను మోసమునఁ గూలనేసితిమి. నేను పాపముజేసితిని. నీమరణమునకు మే మందఱముఁ గారణమైతిమి నీసౌశీల్యంబును నీవు వీడవైతివి. దానవీరకర్ణుఁడని ఖ్యాతి నీకుఁగలుగును. నీవైరి యర్జునుఁడు తలవంచియున్నవాఁడు. మాతప్పులు మన్నింపుము.

క—కృష్ణా! ఓజగద్రక్షకా! అజ్ఞానమునఁ దెలియక పరమాత్ముండవగు నిన్ను విశేషించి తూలనాడితిని నాసర్వాపరాధము

లను మన్నింపుము. అర్జునా ! విజయుఁడవనుపేరిప్పటికి నీకు సార్థకమైనది. భారతసంగ్రామవీరుఁడవై జయమంది సర్వశత్రుసంహారముగావించి రాజ్యమేలుకొమ్ము. నాప్రాణము లింక నిలువవు.

అ—అంగపతీ ! దానవీరుఁడవగునీశక్తి నెఱుంగక భ్రమపడితిమి. నిన్ను వధించుట కేవల మన్యాయమూలకమని యెఱుంగుదును. అయినను నాకుమారుఁడగు నభిమన్యునిమరణవార్త జ్ఞప్తికివచ్చినకతంబున నామానస మెంతటిపాపంబునకయిన సమ్మతించెను. ఇందులకు నాకేప్రాప్తి గలుగనున్నదో !

క—అర్జునా ! చింతింపకుము. అభిమన్యుమరణమునకుఁ బ్రోత్సహించినవాఁడను నేనని—యింతకుముందు ముకుందుఁడు పలికెను. నేనట్టివాఁడ నేని—మహాఘోరనరకములనుభవింతునుగాక! పార్థా! కౌరవసైన్యములందు నీకుమారునిమరణ మన్యాయమని సంతాపమందినవాఁడను నేనొక్కఁడనే సుమా ! నాప్రియనందనుఁ డగు వృషసేనుని మరణంబువలననైన పుత్రశోకము నెఱుఁగజాలనా ? అట్టిశోకము నీకు గలుగఁగలదని దూరమాలోచించితిని సుమా !

అ—కర్ణా ! నన్ను మన్నింపుము.

క—శ్రీకృష్ణా ! నీ కింకరుకమారు వందనము—మూఢుఁడను. కించిజ్ఞుఁడను. నాపాపములు బాసిపోవునట్లనుగ్రహింపుము.

క—ఏదేని నీ వొనరించిన పాపమే యుండినను నీదాతృత్వంబున నన్నియు నణఁగెను. నీ కేమి గావలయునో కోరుకొనుము.

క—కృష్ణా ! సర్వభోగంబు లనుభవించితిని. నా కేకోరికయును లేదు. ఈ హేయప్రదేశంబున గతిమాలి మరణింపనుంటిని. దహనంబునకు వంశాంకురమైన లేకుండనయ్యెను. పాపదూరమగు పవిత్రస్థలంబున నన్నుఁ దహన పఱుపుము. ఇదే నాకోరిక—

కృ—అట్టిస్థల మేది ?



క—నీహస్తతలమే !

కృ—అటులె చేయుదును. నాడువిదురునితో నేనునీకడకు సాధురూపంబున వచ్చినప్పుడు నాకునీవుచందన మందిరదానముం జేసితివి. ఇప్పుడు నేను నీకు వైకుంఠమందిరదానముం జేయుచున్నాను.

క—అనుగృహీతుఁడ.

కృ—మరియొకమాట. నీమరణకాలమున దగ్గరనుండవలయునని నీబంధువులు గుమికూడివచ్చిరి. రమ్మందువా ?

క—వలదు వలదు నిర్మలమగు మనస్సు చెదిరి దుఃఖితమగును.

కృ—నీయిష్టప్రకారమే చేసెదను. (తెరవంక చూచి) ఓహో ? కర్ణహిత చింతకులారా ! మీరాకకు కర్ణుఁ డనుమతింపలేదు. [illegible] నింతటినుండియు దానవీరకర్ణుఁడని పిలువవలయును. ఆతనిప్రాణములుండగనే యొక్కమారు తవచెవులతో దనకీర్తిధ్వానముల నాలకించును. నాతోపాటు మీరందరును కర్ణునిఁ గీర్తింపుఁడు.

"జయ్ ! దానవీరకర్ణునకు జయ్ !!"

[తెరలో వెంటనే]

"జయ్ దానవీరకర్ణునకు జయ్ !!"

అ—కృష్ణా ! కర్ణునిముఖము విలక్షణకాంతిచేఁ బ్రకాశించుచున్నదేమి ?

[illegible]హాకావ్యాస్త్రమయమైనది. కర్ణాస్త్రమయమును నైనది. [illegible] నిర్వర్తితము.

అ—దానవీరకర్ణుని యాత్మకు శాంతి గల్గుఁగాక !!

కృ—తథాస్తు.

[కర్ణుని, కృష్ణుఁడు తనకరతలమున దహనము చేయఁగా వైకుంఠమున కర్ణుఁడు కనబడును.]

గద్య.

ఇది, శ్రీభద్రాచల సీతారామచంద్ర కరుణాప్రసాదలబ్ధ కవితావిభాసితుఁడును సోమరాజ, వంశసంభవ, కోదండరామ చూడమాంబా గర్భశుక్తి ముక్తా ఫలమును, భరద్వాజగోత్ర పవిత్ర ప్రస్తంభనూత్నుఁడును, స్వరాజ్యరథాది బహు గ్రంథకర్త యనఁగు రామానుజ రాయ ప్రణీతంబగు, దానవీరకర్ణ మహా నాటకంబున, సప్తమాఙ్కము సర్వంబును సంపూర్ణము.



రాజన్ ముద్రాశాల—రాజమండ్రి.

ముద్రణమున నున్నవి.

## క్రొత్త నాటకములు.

[సోమరాజు రామానుజరావు గారివి.]

తాజ్ మహల్.

ప్రతాపరుద్రీయము.

గంగావతరణము.

భీష్మ.

కర్మవీర పార్థ.

ధర్మవీర బలి.

## శ్రీకృష్ణా బుక్ డిపో,

రాజమహేంద్రవరము.

ప్రొప్రయిటర్సు,

బ్రహ్మజోస్యుల వేంకటసుబ్బారావు,

సోమరాజు రామానుజరావు.

### నవలలు.

1 ఆంధ్రప్రచారిణీ వారివి.
2. విజ్ఞానచంద్రికా వారివి,
3. సరస్వతీ గ్రంథమండలివారివి.
4. పానుగంటి వారివి.
5. వేగుంచుక్క వారివి.
6. చిలకమర్తి వారివి,
7. వావిళ్ళవారివి.
8. ఆనందప్రెస్ వారివి.

| | |
|---|---|
| ఘోరప్రతిక్రియ | 1-8-0 |
| కుసుమ | 1-4-0 |
| నరాధమ | 1-2-0 |
| వనదుర్గము | 1-0-0 |
| భయంకర బఢాచోర్ | 1-0-0 |
| ఆత్మసామ్రాజ్యము | 1-0-0 |
| చిత్రలేఖ | 0-10-0 |

### నాటకములు.

తిరుపతివేంకటకవుల వన్నియు
కాళ్ళకూరివారివి.
శాంతి వారివి.
ద్రోణమరాజువారివి.
చ॥ మా॥ శర్మగారివి.
గూ॥ కో॥ రావుగారివి.
బ॥ కో॥ రావుగారివి.

రామనారాయణ కవులవి.
బళ్ళారివారివి.
అ॥ సుం॥ గారివి.
ఉం॥ ఆలీషాగారివి
వ॥ సు॥ రా॥ గారివి.

| | |
|---|---|
| రోషనార | 1-0-0 |
| సువర్ణపాత్ర | 1-0-0 |
| కనక్తార చం॥ కే॥ | 1-4-0 |
| కృష్ణలీల సం॥ సిం॥ | 1-0-0 |
| రామదాసు (బళ్ళారిది) | 1-0-0 |
| మహానంద | 0-12-0 |
| బొబ్బిలియుద్ధం శ్రీ॥ కృ॥ | 1-0-0 |
| సత్యహరిశ్చంద్రీయం బ॥ ల॥ | 1-0-0 |
| సాత్రాజితీయం | 1-0-0 |
| ఉత్తరరామచంద్ర | 1-0-0 |
| బుద్ధిమతీవిలాసం | 1-0-0 |
| స్వరాజ్యరథం | 0-8-0 |
| తులసీదేవి | 1-0-0 |
| సావిత్రి | 1-0-0 |
| ద్రౌపది | 1-0-0 |

### హరికథలు,

నారాయణదాసుగారివి.
బాలాజీదాసుగారివి.

రాజన్ ప్రెస్, రాజమండ్రి.

# సుల్తానా—రెజియా.

[దానవీరకర్ణ కర్త ఇం దీనిని వ్రాసెను.]

అల్టమష్ మరణించినతరువాత నాతనికుమార్తెయగు రెజియా ఢిల్లీ సింహాసనము నెక్కి సుల్తానాయై పరిపాలించుటను జూచి యోర్వలేక, కన్నుల నిప్పులనురాల్చిన, వజీర్ జలాలుద్దీనుపాత్ర మహాభయంకరస్వరూపమున, పాఠకులకు కన్నులగట్టుచున్నది. బానిసవర్తకము నారంభించి, రెజియావలన పరిహరింపఁబడిన మల్లిక్ తాచుబాము వలె పగఁబూని వెంటాడించి సుల్తానాను కటారితో గుండెలలోఁ బొడిచిచంపుట. భీభత్సప్రదర్శనము. రాణిపరిచారికయగు భామియాకు యాఖూతుఖానునిపైనను, యాఖూతుఖానునకు భామియాపైనను నన్యోన్యప్రేమాబంధముండఁగా, నీప్రేమసూత్రమును, షేకుఫరీదుభామియాప్రేమను, రెజియాయాకూతుఖానుప్రేమనుఁ గోరి యిరువంకలకులోగుట ఈప్రేమయుద్ధమున నాసూత్రము తెగి, షేక్ ఫరాదున కాశాభంగము, సుల్తానాకు ఘోరమరణము, భామియాయాఖూతుఖానులకు కల్యాణముగ్గలుట. అద్భుతపరిణామపూరితమగు నిట్టిమహానాటక మాంధ్రభాషలోనింతవఱకు లేదు. ప్రేమరంగములు చదువునప్పుడు పాఠకులు మదనసాగరమున దేలియాడెదరు. హత్యారంగములు క్రోధరంగములు చదువునప్పుడు గుండెలదర భీతినందెదరు. వేయేల ? చదివియానందింపుఁడు.

త్వరలో వెలువడనున్నది.

శ్రీ కృష్ణాబుక్ డిపో

రాజమహేంద్రవరము.

